# సూరీడు మావోడు

కవితా సంపుటి 1970 - 1985

కె. వి. ఆర్.



# మీ స్మృతికి నేనే అంకితం

చెరబండరాజూ,

నా ఆత్మ [illegible] సంగీతం
నా [illegible]
నా పాట
నా పోరాటం
కెవిఆర్ కి
[illegible]

నా చైతన్యంలో అంతర్భాగమై పోయిన మీరిద్దరూ నన్ను మాటిమాటికీ కలవరపెడుతున్నారు. మీకూ నాకూ అభేదమే. మీ గురించి ఏమి రాయాలన్నా నా కలం ఆగదు, [illegible], మాట రాదు, స్పృహ ఉండదు. మీ స్మృతికి నేనే అంకితం కాగా, మీకు నా కావ్యాంకిత మెందుకు?

కె. శివారెడ్డి
6-12-85

## ఇందులో ...

పుట :



" మార్క్సిజమే మా పథం ! మావో వజ్రాయుధం " —

త్రిపురనేని మధుసూదనరావు

# భావోద్వేగి

తన కవిత్వానికి టెస్టిమోనియల్ ఇవ్వమన్నారు కెవిఆర్‌గారు. ఆ అర్హత నాకు లేదని నాకేకాదు, ఆంధ్ర సాహిత్య ప్రపంచానికంతా తెలుసు.

అక్షర జగత్తులో గానీ, ఆధునికాంధ్ర కవిత్వ పరిశీలనలో గానీ, గురజాడ, దువ్వూరి మొదలు చెరబండరాజు దాకా కవిత్వానికి 'ఖరీదు కట్టిన' షరాబు ఆయన.

సాహిత్య విమర్శకునిగా, సాహిత్య చరిత్రకారునిగా కెవిఆర్‌కు ఉన్న స్థానమే కవి కెవిఆర్‌ను న్యాయంగా అంచనావేసే అవసరానికి ప్రతిబంధకమైంది

కవులందరూ తమ కవిత్వం గురించి ఆయన విమర్శ తెలుసుకో గోరుతారు. పాఠకులూ తమ అనుభూతిని ఆయన విమర్శనా దృష్టితో విశ్లేషించుకోజూస్తారు. ఇంక ఆయనలోని కవి గురించి ఎవరు అంచనా వేయాలి?

కెవిఆర్ సాహిత్య ప్రపంచంలోకి కవిగానే వచ్చాడు. కవిగానే గుర్తింపు పొందాలని తపన పడుతున్నాడు అంటే ఎవరికైనా ఆశ్చర్యంగా వుండొచ్చు. ఆయనకు కవి అనేమాట ఎంత ఇష్టమైందంటే అది తన సమీక్షక నామంగా వాడుకున్న కవి ఆయన.

సాహిత్య విమర్శకుడు కప్పేసినట్లే కెవిఆర్‌లోని ఉద్యమ రాజకీయ చరిత్రకారుడు కూడ ఆయనలోని కవిని రొమాంటిక్‌గా ఊహించుకునే వాళ్ళకు కనిపించకుండా చేసాడు.

'మహోదయం' రచనా కాలానికే ఆయన 'అడవి' నుంచి 'అంగారవల్లరి' దాకా మూడు కవితా సంకలనాలు వెలువరించి వున్నాడు. మూడూ ఆంధ్ర దేశంలోని మాత్రమే కాదు, అంతర్జాతీయ సమకాలీన నిర్దిష్ట సామాజిక సంఘర్షణలు ప్రతిస్పందనలు.

అరసంలో కెవిఆర్ క్రియాశీల కార్యకర్త కాకపోలేదు. కాని విరసం సంస్థాపక కార్యదర్శిత్వం గానీ 'ఝంఝ' కవితా సంకలనం గానీ ఆయనను కవిత్వ ఆచరణలోకి దించలేదు.

'అకులందున అణగి మణగిన' రోజులు పోయాయి 'కదిలేదీ కదిలించేదీ పెనునిద్దుర వదిలించేదీ' కూడా చాలదు. 'ప్రజను సాయుధ గ్రేపిస్తున్న రెవల్యూషనరీ నేటి కవి' 'జైలు కోకిల' కావడం గతితార్కిక చారిత్రక పరిణామం.

“ఝంఝ” గురించి “రాజద్రోహ” నేరం, విరసం కార్యకలాపాల గురించి సికిందరాబాదు కుట్ర కేసు, “డిటెన్యూ డైరీ” గురించి పరువు నష్టం దావా, సికిందరాబాదు కుట్ర కేసు ఎత్తివేయాలన్నందుకు లాకప్ లో లాఠీ చార్జ్, మరో కేసు, కొంకణీ భాషావాదాన్నీ, జాతుల పోరాటాన్నీ బలపరచినందుకు ఎ ఐ ఎల్. ఆర్. సి. ప్రధాన కార్యదర్శిగా గోవాలో “రాజద్రోహ” నేరం, కె వి ఆర్ రాజకీయ కవి జీవితంలో ఈ పదిహేనేళ్ళు తెచ్చిన పరిణతి.

ముప్ఫయి అయిదు మంది విరసం సభ్యులు ఎమర్జెన్సీలో జైల్లో వున్నపుడు విశాఖ, రాజమండ్రి, వరంగల్, నెల్లూరు, సికింద్రాబాదు, హైదరాబాదు జైళ్లను సమన్వయిస్తూ సంఘమూ పత్రికా జైళ్ళకూ బయళ్ళకూ సంధానించిన శక్తిని ఆయనకు నక్సల్బరీ రాజకీయాలిచ్చినవి.

నలభై సంవత్సరాలుగా కమ్యూనిస్టు ఉద్యమచరిత్రకు సాక్ష్యంగానే చరిత్రలో భాగంగావున్న ఈ చరిత్రకారుడైన కవి కవిత్వంతో చరిత్రను తెలుగు సాహిత్య అభిమానులకు అందించాలని చెరబండరాజు కలలు గనేవాడట.

“సూరీడు మావోడు”లో కూడా అది పూర్తిగా సాధ్యంకాకపోవచ్చును గాని కమ్యూనిస్టు ఉద్యమంలో “సెక్టేరియన్” అని బదనామీకి గురిఅయ్యేంతగా ఎప్పుడూ ఎడమకే జరుగుతూవచ్చిన కె వి ఆర్ కవిత్వంతప్ప, తెలుగులో ఈ ఎనిమిదేళ్ళ ఉద్యమాల వేడిని మరేవీ మనకు చురుక్కుమనవు. కవిత్వంలోనేకాదు “అరుణతార”కు ఆయన సంపాదకత్వం వహించినంత కాలం ఎన్ని శీర్షికల్లోనో ఆయన ఈ పోరాటం తనలో కలిగించిన ఆటుపోటులకు ఆకృతినిచ్చాడు. “ఫ్రాంటియర్” పత్రికకు తెలంగాణా రైతాంగపోరాటపు రాజకీయ వ్యాఖ్యాత అయ్యాడు.

అంగారవల్లరి సంకలనంలో కృష్ణానదిని ఈదిన కమ్యూనిస్టు విప్లవకారుడు వెంకటాచలం మొదలు స్పెయిన్ అంతర్యుద్ధంలో అమరుడైన క్రిస్టోఫర్ కాడ్వెల్ దాకా కవితా వస్తువులే.

కెవిఆర్ మొదటినుంచీ రాజకీయ ఉద్యమకారవి ప్రతి ప్రజాఉద్యమంమీద సంఘటనమీద ఆయన స్పందించి రాసారు. అయినప్పటికీ అన్వయకాఠిన్యం భాషాపరంగానూ భావపరంగానూ ఆ విషయాన్ని మనకు వెంటనే స్ఫురించనివ్వదు

కవికూడా ఏదో ఒక మేరకు పాఠకుడు కాకుండా, కళల్ని ఆస్వాదించేప్పుడు ప్రేక్షకుడు, శ్రోత, పాఠకుడు అనివార్యంగా పొందే పామరస్థితితో మమేకంకాలేదు. కెవిఆర్ చదువుకున్నదంతా, తెలుసుకున్నదంతా మరచిపోకుండా కవిత్వం రాయలేడు.

విరసం ఏర్పడిన తర్వాత ఆయన వెలువరిస్తున్న మూడవ కవితా సంకలనం ఇది. పాణిగ్రాహి నుంచి కొల్లిఠరదాకా, శ్రీకాకుళం నుంచి తెలంగాణాదాకా, నగ్జల్బరీ శ్రీకాకుళం, కరీంనగర్ ఉద్యమాల చరిత్రను సంఘటనలతో, భావచిత్రాలతో, రక్తదృశ్యాలలో పేర్చుకుంటే అది పేర్చుకాదు, 'ఎర్ర పిడికిలి' అవుతుంది.

విద్యార్థి ఉద్యమ కాలంనుంచి, సుందరయ్యగారి జీవితచరిత్రకారుడన్నంతదాకా ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ ఉద్యమంలో కానీ, సిపిఎంలో కానీ, ఎంత గొంతుక లోతుకు దిగినా ఆయా పార్టీల దృష్టిలో ఆయన వామపక్ష మేధావి మాత్రమే. ఆయన చైతన్యం వల్ల ఆయన రేకెత్తిస్తు కాలేదు గానీ, ఆయా పార్టీల విలువల్లో ఆ స్పృహ లేదనడానికి ఎన్ని దాఖలాలయినా చూపవచ్చు.

శ్రీకాకుళ ఉద్యమంలో పాణిగ్రాహి అమరత్వంతో ఆయన నగ్జల్బరీ రాజకీయాలవైపు మొగ్గుతున్నప్పుడు కెవిఆర్ కూడా కవిత్వంలోంచి కమ్యూనిజంలోకి వచ్చాడనడానికి ఇది మరొక నిదర్శనం. పాణిగ్రాహి అమరత్వంపై ఆయన కవిత, సోవియెట్ రష్యా సామ్రాజ్యవాద స్వభావాన్ని సంతరించుకుంటున్నదని ఆయన సుందరయ్య, బసవపున్నయ్యల దగ్గర నిజంగానూ నిజాయితీగానే వెలిబుచ్చిన సందేహాలే ఆయన సిపిఎం 'విమర్శకి' గురికావడానికి తొలి కారణాలు.

రివిజనిస్టు పార్టీల రాజకీయాల దివాళాకోరుతనం ఎంతదూరం పోయిందంటే ఆంధ్రా బై-ఎలక్షన్స్‌లోనూ, భారత్-చైనా యుద్ధంలోనూ కమ్యూనిజాన్నే దూషించిన, నిందించిన కవులతో వాళ్ళకు పేచీలేదు. భారత్-చైనా యుద్ధం రోజుల్లో చైనాను దూషించడానికి నిరాకరించిన కవి కెవిఆర్ ఒక్కడే.

ఇంద్రవెల్లి విషాదం జరిగినపుడు మనోరంజన్ మొహంతితోపాటు తాను స్వయంగావెళ్ళి రక్తంలోతడిసి బాలంలోపడివున్న గోండు వస్త్రాన్ని, కర్రను ఎర్ర జెండాగా ఎత్తిచూపాడు. కరీంనగర్ బీళ్ళలో రగిలిన విప్లవంతో కన్నెర్రచేస్తూ లేస్తున్న నాగలి కర్రనుగానీ, ఈనాటి వరంగల్ నిర్బంధం మౌనమృదంగాన్నీ గానీ ఆయన పలికిస్తున్నాడు, మోగిస్తున్నాడు.

ఇవ్వాళ ఆయన తృప్తి తనచుట్టూ నిర్మాణమవుతున్న చరిత్రలో భాగమవుతూ ఆ చరిత్ర రచనచేస్తున్నందుకే. అకడమిక సాహిత్య విమర్శకునిగానో చరిత్ర రచయితగానో కాకుండా రాజకీయ కవిత్వం రాస్తున్నందుకే

అయితే ఈ కవితాసంకలనంలో వర్తమాన గోదావరీతీర పోరాటం చరిత్రగా కనిపించకపోవచ్చు. ఒక భావోద్వేగి సంక్లిష్ట మానసిక సంక్షోభ రూపమైన కవిత్వంగా కళ్లకు కడుతుంది. మనసుకు హత్తుకుంటుంది. " మహా సంక్షోభంగానీ గొప్ప శాంతికి దారితీయదు ".

14-12-1985 వరవరరావు

# మరి నా మాటో?

నిజం, నమ్మండి, నమ్మకపోండి: అది మీ యిష్టం. కవిననో, రచయితననో, బుద్ధిజీవిననో, మేధావిననో, నేనై నేనెన్నడూ చెప్పుకోలేదు. విమర్శకుణ్ణనీ, విజ్ఞానిననీ, తాత్త్వికుణ్ణనీ, "క్రాంతిదర్శి" ననీ, ఋషిననీ, నాకై నేనెవరినుంచి హెచ్చూ మెచ్చూ కోరుకోలేదు. యాచించలేదు యోగ్యతా పత్రాలు, అర్థించలేదు పంచరత్నాలు, పొగడమనలేదు. పొగడ దండ వెయ్యమనలేదు. పదవి, బిరుదు, సన్మానం, సత్కారం, సభాగౌరవం, ప్రభుపోషణం — ఇవేవీ నానుంచి వెలువడ్డ ఆశలు కావు. నా ఆకాశం యీ నేలమీదనే. ఈ నా జనమే నా ప్రాణసంపదం. వీరి ఉన్నతి ఒక్కటే నా ధ్యేయం. అందుకోసమే నా శక్తి, నా ఓరిక, నా కాలం, నా సమస్తం.

కలంపట్టి అర్ధశతాబ్దం కావస్తూంది "ఈ నా పేనా పట్టిన చేయే" వెయ్యో అయినా అంటూ ప్రశ్నించుకునికూడా ముప్ఫై నలభై యేళ్ళు అయింది. వెయ్యో లక్షో కావడం ఎందుకోసం? ఒంటరి పీడు వచ్చిన మరుగా, పవిత్రోగ్ర పవిచేనుగా, చెమట సంపదగా, కాయకష్టం నష్టపడనట్లుగా, "కూలి నాలిగా" "రైతు రౌతుగా" కుమ్మరినుంచి చక్రినీ, శిరినుంచి శౌరినీ, భావించుకునికూడా ఇరవై ముప్ఫయ్యేళ్ళు అయింది. పల్లెటూరినుంచి టౌనుకీ ఇసక పొంకనుంచి తారురోడ్డుకీ, ఒంటెద్దు బండినుంచి ప్రస్తుతానికి కారుకీ, గుంట ఓనమాలనుంచి ఉద్గ్రంథాలకీ, వీధిబడినుంచి విశ్వకళాపరిషత్తుకీ ఎదిగాను కాని అది వృద్ధికాదని తెలుసుకోడానికి యిరవై యేళ్ళు పట్టింది. పుట్టి పెరిగిన వూరిలోనే దాని కొసనున్న వాడలోనే, గంజి తాగి, సంగటి మెతుకులుతిని అహర్నిశలూ పనిజేసే మట్టిమనుషుల్లోనే ప్రాణానికీ, పరిజ్ఞానానికీ, సంపదకీ సంస్కృతికీ, ప్రాణమూలం వుందన్న వాస్తవం గుర్తించడం వరకైతే అది వెనకెన్నడో జరిగిందిగాని, స్వజనంతోటి పూర్తిగా మమేకంపొంది వారి ఆర్తినుంచి నా సాధాగ్నినీ, వారి ఆక్రోశంనుంచి నా భావాస్త్రాన్నీ, వారి అసంతృప్తినుంచి ఉద్యమ విప్లవకసీ సాధించుకుని ఆచరణకో నిరంతరాయమైన, క్రియగా మార్చుకోడానికి యీ పదిహేనేళ్ళకాలమే (1970_1985) నిజంగా నాకు నవయౌవనం యిచ్చింది. ఇలా నవవృద్ధాప్యంలో మళ్ళీ ఉత్సాహాతిరేకం వరదలా నన్ను ముంచెత్తింది.

అయితే, నిజమే చెప్పాలిగదా! 'నక్సల్బరీలో' 1967 లోనే వ్యావసాయిక విప్లవోద్యమంలో తొలి సాయుధపోరాటం మొదలైన రెండు మూడేళ్ళకుగాని, దానికి అనుకూలమైన భావపరిణామం నాలో స్పష్టమైన రూపం ధరించలేదు. 'దుస్సాహసంలో' గూడుకున్న వినాశనమనీ, భౌతిక పరిస్థితు లనుకూలంగాలేదనీ,

"విప్లవం
మందప్పిన గజాచారి కృత్యంకాదు."

అంటూ, 1968 డిసెంబర్ 21లో సి పి ఐ (యం) పత్రిక 'జనశక్తి' "ప్రయాణం" అనే గీతం ప్రకటించాను "నక్సలిజం" అనే పేరుతో గేయంలో 'తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం' అనే మావో సూక్తిని అపహాస్యం చేస్తూ,

"మాటలె తూటాలవుతై సూక్తులు హాస్యాలవుతై
మావో చెబితే వేదం ఓనామాలు పల్లిస్తై
బరే భలే!"

అన్నాను. ఆచరణ ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పడానికీ, కార్యకర్తల దృష్టిదీక్షనూ శ్రామికవిప్లవ నిబద్ధతనూ సూచించడానికీ, ఇలా రాయవలసివచ్చింది. పెంచి ఆయుధాలు ప్రజాసైన్యంలేకుండ, విప్లవపోరాటం విజయవంతం కావాలనడం భావించేటి '[illegible]' అనే గీతం ప్రకటించాను. తుపాకులనేవి పసిపిల్లల దీపావళి టపాకాయల్లాంటివి, రోలూరోకలి అనే పిల్లల పేలుడు సిగ్గుపుల ఆటల్లాంటివో కావని, 'లుంపెన్' ఎలిమెంట్లు ఈ కొత్త ఉద్యమంలో "దుష్కార్యక్రమం" లోకి దూకి దారిదోపిడీలు చేస్తూ చోరీలకూ ఖూనీలకూ దిగుతున్నారనీ రాశాను. అప్పటి నా భావాలు అవే. దాచుకుని లాభంలేదు. అవి దోషాలైతే వాటికి ఇప్పుడు సిగ్గుపడి క్షమాభిక్ష అడిగి లాభం లేదు. నాది 'అవకాశ వాదం' అనేవాళ్ళున్నారని నాకు తెలుసుకాని, అది భావపరిణామ క్రమమని ఇతరులు గ్రహిస్తేచాలు. సుబ్బారావు పాణిగ్రాహి 'ఎన్‌కౌంటర్' హత్యావార్త విని, హఠాత్తుగా తెలివివచ్చినట్టుగా, మార్క్సిస్టుపార్టీ పత్రికకు నా 'షాక్'నూ, విచార విస్మయాలనూ ప్రకటించే గేయాన్ని వాళ్ళు తొక్కివేయడంతోటి, నా ఆలోచనా సరళిలో రాసాగిన మార్పు మలుపు తిరిగింది.

ఇది సాహిత్యమా, కవిత్వమా, శిల్పమా, సంవిధానమా, లేక రాజకీయమా వర్గ పోరాటమా, విప్లవయుద్ధమా అంటూ వేరువేరుగా విశదీకరించుకునే సంకుచిత స్థితిలో లేను. 'సర్వమ్ సామాజికమ్ జగత్' అనే స్థితికి వచ్చివున్నాను. కళో కళకళపడుతూన్న

సమాజ జీవనంలో, ఏదైనాసరే, వాటిమధ్య నాకు అభేదమే. 'అస్ఖలిత' 'అకలుషిత' 'శుద్ధ' అప్రమేయాలతోటి నాకేపనీలేదు. చారిత్రక ప్రమేయమే ఏకైకమైన నా ధ్యాస. అది ఏకాగ్రం అంటే శుష్కోగ్రం అనిపించవచ్చు. అనిపించనీ! అల్ప వ్యక్తిత్వ పరిధినుంచి బైటపడగలిగాను. ఆదేవాలు కర్త అయిన సామాజిక శక్తికి క్రియద్వారా సత్ఫలితం చేకూర్చడంకంటె సంస్కృతికి వేరే పరమార్థం ఏముంది? సంస్కృతికి పెట్టని నిధి సాధారణ ప్రజే. దాని రాజ్యాధికారమే సంస్కృతికి మానవీయతనీ, మనిషికి సంస్కృతినీ సమకూర్చి, వేళ్ళపర్యంతం విస్తరించిపోయిన అఘాతాన్ని పూడ్చి యథార్థ సాఫల్యాన్ని, వాస్తవ స్వేచ్ఛా స్వాతంత్ర్య సౌభ్రాత్రమయమైన మహత్తర సామాజిక వ్యవస్థకు ప్రారంభం కాగలదు.

మరి చాలిస్తాను ఖండికలను ఎంపికచేసి, విమర్శించిన మధు, ముందుమాట రాసిన వి. వి, ముఖచిత్రం వేసిచ్చిన భాస్కర్. అచ్చుపని చూసిన పురుషోత్తమ్, ఆ పనిచేసిన ప్రెస్ కార్మికులు వీళ్ళంతా కృతజ్ఞతాపాత్రులు మధు, వి. వి, సాంస్కృతిక సహ-కార్యకర్తలు. పురుషోత్తమ్ భాస్కర్ ఆత్మీయులైన భావ బంధువులు.

కె. వి. ఆర్.

# నిజమయిన కల

కలగన్నావు కలగన్నావు కలను నిజమనే జీవించావు
కలగన్నావు కలగన్నావు కలవెంబడి లోకంపై కెళ్ళావు
కలగన్నావు కలగన్నావు కలలో కొండలు కనుగొన్నావు
ఆ వెలికొండల సందిటిలోపల అఖండ జనరాజ్యం చూశావు

కలగన్నావు కలగన్నావు కాంతి మండలంలో మెదిలావు
నానాదిక్కులు చీల్చుకు వచ్చిన జనసూర్యుని కిరణాల్లో మెసిలావు
ఆ స్థిపరుల దోపిడి దుర్గంపై అగ్ని దండయాత్రే నడిపావు
భూతకాల భూతాల గృహంపై భావిపతాకం నెలకొల్పావు

ఘాతుక పాతక నరాధములపై మారణహోమం మొదలెట్టావు
దుర్మార్గం నెత్తురులోడంగా బరిశెలు బాకులతో చీల్చావు
కలగన్నావు కలగన్నావు కలలో మంచిని దర్శించావు

మనిషితనమొకే మంచితనమనే మానవీయతను రాబట్టావు
సాయుధ కరుణే సార్థకమౌనని జాలిని బలశాలిని చేశావు
కలగన్నావు కలగన్నావు విప్లవహింసంటే నేర్చావు

నవ్వు శక్తిగా నేస్తం కళగా మనుషుల మనుసుల నలరించావు
సొంత విషయమేదైనా కానీ, సమిష్టి సౌఖ్యం ఆశించావు
కలగన్నావు కలగన్నావు కలను నిజంగా జీవించావు।

**కామ్రేడ్ గడ్డం కోటారెడ్డి స్మృతికి**
**(మరణం 7-8-1974)**
**సికిందరాబాదు జైలు, 22-8-1974**

సూరీడు మావోడు

2

# వేసవి రాత్రి

గాలాడక స్తబ్దంగా కాలిన పూరిల్లుగా
కూలిపోక ఒరిగివుంది నల్లబడిన గోడలతో
నగ్నంగా - నడివేసవి సెగగక్కే రాత్రి...

ఉక్కపోతలో మనస్సు ఉన్మత్తం అవుతూంటే
ఉడుకెక్కిన నీటినుంచి ఉబికే బుడగల్లాగా
క్రిక్కిరిసిన చుక్కలలో సుక్కుతున్న రాత్రి. ..

ఇటువాలీ అటువాలీ ఇల్లంతా దొర్లి పొర్లి
నీటి తేమ లేకుండా నలుమూలల నుంచి మూగు
నీరస మేఘాలతోటి నిష్ఠురమాడే రాత్రి....

మూరెడు దూరం కూడా ముందుకు పోలేక నిలిచి
కూరుకుపోయిన కాలిని బురద నుంచి విడలాగే
ఎద్దులాగ భారంగా ఎగరొప్పే రాత్రి...

గొంతువిడని మూలుగుతో ఘూర్ణిల్లే నిశ్శబ్దం
గుండెకు దడబుట్టించే కంపమాన దౌర్బల్యం
ఉరువెక్కే తారల గోరీలమిట్ట రాత్రి....

వలువల్లాగే మాసిన విలువల నూడ్చాలంటూ
గిలగిల్లాడే జీవుడు దిగంబరుడు అవుతాడని
చెంపలేసుకుని పాఠం చెప్పుకునే రాత్రి....

—ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 10-7-19

## 3

# సేవ్ ది టైగర్!

పాపం. రక్షించండయ్యా పులిని
పైబడి మాటేసి వేటాడి వధించకండి
మనది పుణ్యభూమి అని మరవకండి
మానవులతో వ్యాఘ్రాలను కలిసి మననివ్వండి!

'పులి' అంటేనే చచ్చేంత గిలి మీకెందుకు?
పెంపుడు పిల్లికంటె సాధుజంతువు పెద్దపులి
నల్లిని నలిచెయ్యండి బల్లిని కొట్టెయ్యండి
పులిగారిని మాత్రం పదిలంగా బతకనివ్వండి!

"అహింసా పరమోధర్మః"
"ఆత్మవత్సర్వ భూతాని"
"చంపదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడుఁ జేయరాదు!"

కేసరి పని అయిపోయింది. పులిదే ఇకపై రాజ్యం
కేసరి కాదండోయ్. పులే ఇకపై దేశానికి చిహ్నం
పులి 'జాతీయమృగం'గా మారిపోయిందోహో!
పులికి జాతీయవాదం నూరిపోశామోహో!

బ్రిటిష్ సింహానికి వారసురాలు భారత-పులి
భూస్వామ్య గ్రామసింహానికి సైదోడు బూర్జువా పులి
రష్యా భల్లూకానికి ఇష్టసఖి ఇండియా-పులి
రివిజనిస్టు నక్క-కు వంతగాడు జాతీయ బూర్జువా-పులి!

మహావోధు

గుండెపైన చెయ్యేసుకు ఆదమరిచి నిద్రించండి
గొర్రెల్లా మందబడి బర్రెల్లా కట్టుబడి ఉండండి
కాగలకార్యం గంధర్వ-పులి తీరుస్తుంది!
కాపురాలను ఇందిరా-పులి చక్కబెడ్తుంది!

రగిలే చిచ్చుకళ్ళతో రాత్రిని హడలెత్తిస్తే
రుచికరమైన నరరక్తానికి పళ్ళతో ఎగబడితే
బక్కమనుషులమీద వుక్కుపంజా దెబ్బతీస్తే
బడితెలూ బరిశలూ తీయకండి భయంభక్తి చూపండి!

ఇది జాతీయపులి ఇది అహింసాపులి
ఇది దేశవాళీ పులి ఇది సంప్రదాయప్పులి
ఇది పిలకపులి జందెప్పులి 'శాఖాహార'ప్పులి
ఇంకేముంది? దేశమూ కోశమూ దానికి పొంగలి!

1972

———

5

## కావల్సింది...

మండి ఆరడం కాదు
ఆరకుండా మండాలి
రాటాకు మంటగానా? కాదు,
దావానలంగా!

వెలిగి ఆరడం కాదు
నిలిచి వెలగాలి
మెరుపులాగానా? కాదు,
కరదీపికగా!

కురిసి వెలవడం కాదు
నిలిచి కురవాలి

కుండ చిల్లిబడినట్లా? కాదు,
కుండ బోర్లించినట్లు!

మెరిసి మాసిపోవడం కాదు
మాపులేకుండా మెరవాలి
మిణుగురు బూచిలాగానా? కాదు,
మింటి చుక్కలా!

అరిచి అలిసిపోవడం కాదు
అలుపులేకుండా అరవాలి
ఉరుములాగానా? కాదు,
ఉదధిలా!

మావోడు

## 6

అప్పుజెప్పి వల్లించడంకాదు
ఆచరణలో పెట్టాలి
        వీధిబడి సంతపాఠంలాగా? కాదు.
        నిత్య జీవితానుభవంలా!

చిలకపలుకులు పలకడం కాదు
సొంత మాట నేర్వాలి
        నిరంతర శిష్యుడివా? కాదు.
        నీకు నీవే నేతవి!

కావల్సింది ప్రజ్ఞ
కార్యరంగాన ఉపజ్ఞ
        క్రియాశీలత
        కృపాణతీక్షణత !

1972

# 7

# సూర్యప్రకాశం

యారాడ కొండమీద తొలకరి మబ్బులు వురుముతున్నై.

డాల్ఫిన్స్ నోస్‌ను వుప్పునాలికల్తో అందుకుంటున్నై రేడియం తరంగాలు.
పామ్‌బీచ్‌లో కొబ్బరిచెట్ల నడుంవులు వళంతప్పి వూగాడుతున్నై.
సెర్చ్‌లైట్ కాంతిలో శ్మశాన దృశ్యాల్లా బయల్పడుతున్నై విశాఖనిశారంగాలు.
సీశాండ్స్ ఎలెక్ట్రిక్ కళ్ళనింకా మూసుకోలేదు.
యూనివర్సిటీ హాస్టల్స్ తేనెతెట్టె రొద తగ్గనేలేదు.
కాల్టెక్స్ కాలనీ సముద్రం ఒడ్డుని విడిచిపోలేదు.

యౌవన వనాన భావతరువు కుసుమిస్తూ కుసుమిస్తూ,

మొవ్వునుంచి వేరుదాకా పిడుగొక్కటి దూసుకుపోగా, నిలువెల్లానీరై, తృటిలో
వృక్షం పత్రపుష్పాలు కాలి కమిలిపోయింది

అగ్ని! అగ్ని!
దుష్కాల శతఘ్ని!
ఆమూలాగ్రమూ బొబ్బలెత్తించి మాడ్చి బొగ్గుజేసే అగ్ని!

వృద్ధిమీద వృద్ధిగా, కామా తర్వాతకామాగా, పాలబుగ్గల ప్రాయంనుంచి చప్పి
దవడల వార్ధకందాకా, మధ్యమధ్య విరామాలతో సెమీకోలన్లతో,
మజిలీలు, మజిలీలుగా సాగిపోయే జీవితానికి ఫుల్‌స్టాప్-

—మృత్యువు!
మరిలేదు వృద్ధి.

మరణం సాఫల్యమూకాదు, వైఫల్యమూకాదు.
మానవుడి బుద్ధి ప్రాణాన్ని మరణంనుంచి వేరుజేసే కాంతిరేఖ గమనం.

మాహోతు

8

పారం ప్రయోజనం- ఏదీ లేనిది చావు
అది ముక్కు చెవులూ తెగిన వికూపి శూర్పణఖ

దానిముందు నువ్వెంత, నేనెంత? ప్రాణులంతా కలిసినా ఎంత॰
మానవశరీరాలకు రక్షాకవచమేదీలేదు. కర్ణుడిది పురాణం
ప్రమాదాల సముద్ర మధ్యంలో మన జీవితం దీవిగడ్డ... మబ్బుల్లో
మెరుపు....
ప్రయోజనం ఒక్కటే జీవితానికి ఏకైక శోభ. అదే లేకుంటే, బతుకంతా
క్షోభ. అంతా చింత.... అడవి ముళ్ళ యిరుకుపుంత.

ప్రయోజనం నీ ఒక్కడిదేకాదు. పదుగురిది మాత్రమే సత్ ప్రయోజనం.
అందులో నీదీవుంది. అలాంటి ఎడ తెరిపిలేని మంచి పనులతో
క్రిక్కిరిసిన క్రతువులా సార్థకంగా జీవించావు. ఉత్తి మనుగడకాదు నీది.
పేరుకు తగ్గట్టు సూర్యప్రకాశమే ననిపించుకున్నావు.
పగటిపూట పనిజేసే సాదా మనుషులపూసే
నీ ధ్యాస, నీ శ్వాస, నీ తపస్సు
అంతర్నిహితమైన నీ ప్రతిభా రోచిస్సు'
అది హఠాత్తుగా స్తంభించిన యోచనా భాగీరథి,
సిద్ధికి ఎంతోదూరాన పురోభివృద్ధి క్రమాన అకస్మాత్తుగా ఆగిపోయిన
కథన కదన కళాసాధన!

ప్రతి ఒక వ్యక్తికీ ఉంది ఒకోరూపం, ఒకోముఖం, ఒకో తీరు, ఒకో తెన్ను.
ఒకొక్కనికీ ఒకానొక ప్రత్యేకత విశేషం. అది అతని మొహరు, అతని ముద్ర
అది నీకిప్పుడు తప్పిపోయింది. అయితే మాలో స్మృతిగా
మిగిలివుంది. మృతి చెందావు గదూ నువ్వు. అంచేతనే ఇప్పుడు వ్యక్తివి
కావు. నీ నవ్వే వాడని పువ్వు, నీ పలుకే కలకండ.
నీపట్టుదలే మెత్తన అనిపించే వుక్కు
వ్యక్తిపోయింది. వ్యక్తి పోయింది

సోమసుందర్

# 9

సమిష్టి మాత్రం మిగులుతుంది, కొనసాగుతుంది.
సమిష్టిలోనే వ్యక్తి జీవిస్తుంది. శక్తిదీపిస్తుంది
అమరత్వం వ్యక్తిత్వం.

ముల్లుపోటునుంచి నేర్పుగా మొగిలి పొత్తిని తప్పించి, పుబ్బు నోటి నుంచి
మెరుపునిలాగి తనీగా నిలిపించి, జీవితాన్ని సార్థకం చేసుకొనే
మనిషి చరితార్థుడు పరార్థమే జీవిత పరమార్థం అప్పుడే
వ్యక్తికి అమోఘ శక్తి. అదే అతనిముఖాన కళ. అప్పుడతడు
అతనువే అయినా అందరిలోనూ వుంటాడు.
నువు లేవూ మా అందరి అంతరంగచైతన్యంలో నిలిచి?
పల్చటి పెదాలనుంచి వచ్చే సిగరెట్ పొగమధ్య,
కార్తిక మాసం పొగ మబ్బుల మధ్య.
పలువరస నుంచి వెన్నెల కురిపిస్తూ,
అరవిరసిన నెల పువ్వుగా
అలరించే చిరునవ్వుగా గుర్తున్నావు నువ్వు
ఆలోచనకు తగ్గ ఆచరణగా
ప్రజాహితకార్యావలంబనగా
భావోద్రేకంగా
భవ్యోద్వేగంగా
దీక్షగా
నిన్ను గుర్తుంచుకుంటాము, యన్నెస్!
ప్రామిజ్!

జూన్. 1972

10

# మంది పండగ

లెగవండిరా కటికి పేదోళ్ల బీదోళ్ల
నడవండిరా పూట తిండికే లేనోళ్లు
మనచేతి కష్టమిక మనకె చిక్కాలిరా
మన చెమట ఫలితమిక మనకె దక్కాలిరా
ఎదురుదిరిగామంటె గద్దెలేవణకాలి:
ఎలుగెత్తినామంటె దిక్కులేపగలాలి:

అణిగి మణిగీ మనం మణికట్లు గట్టుకుని
కుంగి వంగీ మనం కాలుజెయి బట్టుకుని
నోరున్న పురుగులా బుద్ధున్న పశువులా
తరతరాలుగ వూడిగాలు చేస్తున్నాము
కొడుకులూ మనవళ్లు ముందటి తరాలోళ్ల
పనిముట్లుగా గాక మనుషులుగ బతకాలి!

దండుగూడామంటె కొండైన కూలాలి
దెబ్బదీస్తే దెయ్యమైన దిగిరావాలి
ఏటిలో వరదలా సంద్రాన పోటులా
ఎర్రజెండా పిలుపు నందుకుని కదలండి
మనబలం గట్టిరెట్టలబలం అయితేను
ఎదిరిబలమంతాను పిక్కబల మయ్యేను:

గోరీల నుండేటి గొప్పగుండెలవాళ్లు
ఖైదులో గ్రహణాన వుంటున్న సూరీళ్లు
కొండకోనల మున్న దండిచెయ్యిగలోళ్లు
అడవిలో వుండేటి కార్చిచ్చు మంటల్లు

## 11

కోరుట్లపాలైన కమినిస్టు మొనగాళ్లు
వాళ్లెవళ్లోగాదు — మంది నొష్టన కళ్లు.

ఖామందు రాబందులకు రెక్కలూడ్చారు
భూస్వాములకు సోప్రలకు నడుం విరిచారు
చెట్ల ఆకుల్లాగ దట్టముప్పురున్నారు
ఎండలా చండప్రచండ ముప్పుటున్నారు
దున్నెటోనికె భూమి దక్కాలనంటారు
దుర్మార్గ వర్గమిక దౌన్ దౌనంటారు:

పోయినోళ్లు నిప్పురాజేసి పరిపోయ్యారు
దూదిమేటకు అగ్గి ముట్టించి పోయ్యారు
ఈసీమ కాసీమ ఈ వూరి కావూరు
ఈ చేతి కా చెయ్యి ఇక లంకె కలుసుద్ది
చినికి చినికీ గాలి కసురింక కొట్టుద్ది
మనిషి మనిషికి జతై సైన్యమే పుట్టుద్ది.

గోరీల్లోపటినుంచి ఆరనీ మంటల్లు
ఖైదుల్లోపటినుంచి తీరనీ కోర్కెల్లు
కొండల్లోపటినుంచి కరుకైన కైజార్లు
అడవుల్లోపటినుంచి బందూకు బర్మార్లు
కోరుట్లలోనుంచి కమినిస్టు జగజెట్లు
తూరు పెతుపెక్కట్టు తోసుకుని వస్తారు:

మలిసంజ చీకట్ల చిల్లి కంబలి చింపి
తొలిపొద్దునే ఎర్రజెండాగ విప్పారు
గూడేల కొస్తారు గుండెల్లో వుంటారు

మాహోదం

# 12

పేదోళ్ల చేతులకు అండగా కండగా
పెత్తనందార్ల పని పట్టించబోతారు!

బాకులా గాలి పదునెక్కుతూవున్నాది
భూమితల్లికి పురిటి నొప్పి మొదలైనాది
కష్టించెటోళ్ళింక నష్టపడబోరురా
కాలమే మారి దుష్కాలమే ఖతమౌద్ది
సన్న జనమే ఇంకచక్రాన్ని తిప్పుద్ది
మందిపండగ మనది ముందు ముందే వుంది!

మేడే, 1973.

# 13

# మరిచిపోయిన మందహాసం

ఏదీ?
కొంచెమే అయినాసరే రానివ్వు
బిగబట్టిన నీ పెదాల మీదికి
ప్రాణపూర్ణమైన ఒక చిరునవ్వు
చూదామని ఉంది
ఎలాగుంటుందో అది!
తీగలా పాకి రింగులు చుట్టుకుంటుందో
మెరుపులా మెరిసి ఇంతట్లోకే తిరోహితమౌతుందో!
ఏదీ
పిసరంతే అయినా ఫర్వాలేదుగాని
నవ్వు!

కొంచెం కొంచెదనమేమీ కాదులే!
బరువు దింపుకొంటూ
ఆటవిడుపుగా
అమాస వెన్ను దన్నివచ్చే వెలపొడుపులా
ఏదీ?
కాసింతే అయినా సరే వెలువడనివ్వు
మబ్బులు మూసిన నీ కళగల మొగాన
ఒకింత వెన్నెల పుంతగడితేనే
నీ దీర్ఘ దుఃఖయోగానికి
తలవంపులు రావులే!

ఎంతకాలమని ఇలా
ఛిద్రమైన స్వప్నంలా

## 14

ఇబ్బందుల గొందిలో
వంతలుపెట్టిన సంతలో
అష్టకష్టావధానం చేస్తూ
నష్టజాతకురాలివై
కన్నీటిలో నానిన దినుసులనే కొంటూ
రేపంటేనే వెరపుగా
సయించినట్లు గతాన్ని నెమరువేసుకొంటూ
జీవితమని దొంగపేరు పెట్టుకొన్న
ఈ క్షణ క్షణ పరాజయానికి
ఓడిపోయిన ఆత్మ పరాభవానికి
నిస్తులమైన నీ హృదయ ద్రవ్యాన్ని
స్వార్పణం కష్టార్పణం చేసుకొంటూ
ఎంతకాలమని ఇలా చస్తూపోతావు!

గుమ్మడి పాదులా కళకళ్లాడవలసిన
పసరూ పచ్చనా గల
ప్రియమైన ఈ ఒక్కగానొక్క జన్మని
జర్జరీభూతం చేసుకొంటున్నావు సుమీ!
నాకిష్టంలేదు చెలీ
ఇతరులనుంచి నీవు విధించుకొన్న వెలి!
ఊహూ!
అదింక బాగోదు
ఏదేగాని అతి అయిందంటే
వికటిస్తుంది తప్పదు.

కాబట్టి నా మాట విను
విప్పుకో ఇప్పుడిప్పుడే నీమనస్సులో
మెలుస్తూ ఉన్న నున్నపైన వెలిపట్టు రెక్కలూనల్ని

సూరీడు

లాగివెయ్
ఆలోచనల ద్వారబంధాల నడ్డుకొంటూన్న పరదాల్ని!
హంగులేమీ కావవి
గాలినీ ఆడుకోనీ
సీతల నీలాలలో!
సూర్యుణ్ణి చురకలు పెట్టనీ
నీ తనువున అణువణునా!
ఏం ముంచుకుపోయిందని ఈ దిగులు!
నాకు తెలీకడుగుతాను కాస్త బదులుజెప్పు!
నీ దుఃఖాన్ని లోకం మీద రుద్దుతున్నావు
పరిసరాలను పాడుబీడూ ఏడుగాడూ చేస్తున్నావు
పువ్వులమీద మసకలను మోపుతున్నావు
ఇది నీ అపరాధం!

ఎందుకబ్బా ఇంత చిమ్మ చీకటి
నీ గుండెల్లోంచి కళ్ళల్లోకి వచ్చి గూడు కట్టుకూర్చుంది!
కష్టాలుంటేనే
కాష్టంలా కొయ్యబారిపోవలసిందే?
చాల్చాలుగాని మరితే!
ఊపిరాడినందాకా పురుద్దాం దిగులు
సరదాలతో కేరింతాలతో
రా పోదాం బతుకులోకి మళ్ళీ!

ఏదీ ఏదేదీ,
ముసిముసి నవ్వు!
ఒక్కసారి చూపెట్టవూ
ఎన్నడో మరచిపోయిన వెనుకటి చిరునవ్వు?

**జ్యోతి : దీపావళి 1970**

**మావోడు**

# 16

# రామనరసింహారావు కథ

సై సై నర్సింహారావూ-రావూ
నీ ధైర్యాలెవ్వరికీ రావు
నర్సింహరావ్ పేరు జెప్పితే అరుణ పతాకం ఆకసమెక్కును
నర్సింహరావ్ పేరు వింటెనే హిరణ్యకశిపుల గుండెలో హడల్
... సైసై....

చరిత్రనదిలో రాను చిట్టి అల చరిత్రలో నిలవాలని తనకల
పార్టీ చెట్టున తాను లేజివురు పార్టీ తన చూపులకే వెలుగురు
తెలంగాణ పోరాట దీప్తిలో తన దారేదో కనిపించింది
తెలతెలవారేటపుడు చెరువులో తామరమొగ్గే విప్పారింది
....సైసై. ..

అదుగో ఆకాశంలో మేఘం ఆషాఢంలో మేఘగర్జనం
అదుగో నగ్జల్బరి పోరాటం అదిగో పిడుగూ ఇదిగో మెరుపు
యువకుల కదిగో చరిత్ర పిలుపు వీరుల కిద్దిగో మేల్కొలుపు
భారతీయ రైతాంగ విప్లవం ప్రారంభించిన సాయుధోద్యమం
....సైసై....

"ఎందుకొమ్మతో పనేమిటింక? దగా ప్రేమ అవసరమేమింక?
చిగురుకొమ్మ చేవౌతూవుంది చరిత్ర ప్రసూతిమందిరమైంది
నిండు గుండెతో పీడిత ప్రజల కండగ నిలిచేవాడే మనిషి
స్థిరసంకల్పం తెంపరి తనమూ వీరగుణాలుంటేనే మనిషి"
....సై సై....

ఆలూ పిల్లలు పోతేపోనీ! అమ్మకేమి తను రాస్తువున్నడూ:
అమ్మా! నను దీవించగదమ్మా! ఎర్రవీరుడుగ చేసి పంపుమా!

అమ్మ లెందరో వున్నా రిలలో, వీరమాత లేకొద్దిమందియో
దేశానికి నను దత్తతగానిమ్మా, దీనజనాలకు ధారబోయుమా.
....సై సై....

"చరిత్ర పెంచిన బిడ్డను నేను, చరిత్ర ఇకపై నాకు సొంతమే
చరిత్ర నేనే, నేనే చరిత్ర, చరిత్రలోనే మరి నా స్థానం
పార్టీతోనే ఇక సాంగత్యం ప్రజాకోటి తో సాన్నిహిత్యమే.
చరిత్ర సాధనలో రారాజుల యౌరామమ్మా, మరి సెలవిమ్మా!
.. సై సై....

"కాలం గడిచే కొద్దీ మాబలం కంచుగోడగా స్థిరమౌతుంది
కంచుగోడపై కంచుగోడగా కంచుకోటొకటి ఏర్పడుతుంది
ఒకనాటిది కాదీ పోరాటం దీర్ఘకాలికం సాయుధ సమరం
విజయం మాత్రం చివరకు ప్రజదే ప్రజారాజ్యమే చారిత్రక విధి.
....సై సై....

"మురుగు గుంటలో దోమనుగాను మురికిలో బతుకు వెళ్ళబుచ్చను
మలినం మోసం మమ్మల్నంటవు మహదాశయాల భంగపరచవు
దేశానికి నను దత్తుణ్ణి చెయ్యవూ, అమ్మా, నన్నిక బయల్దేర్చవూ"
అంటూ తల్లికి రాశాడండీ రాతను చేతగ మార్చాడండీ!
....సై సై....

యువకుల గుండెలు బొబ్బరించగా విద్యార్థులునూ నిబ్బరించగా
రైతూ కూలీ రణానికురికీ జోతేదారుల తలలే నరికీ
భూమికోసమూ రాజ్యంకోసం భూతబలులు చేస్తున్నా రండీ
బాణాలూ బందుకులు బాణాకర్రలు బల్లే లురుకుతున్నవి!
....సై సై....

రాజ్యశకి గడగడలాడింది రాజ్యేందిర చిటమటలాడింది
[illegible] పంజాపేట్లు పోలీసు పిక్కబలం చూపింది
దూరపు తుపాకి మోతలే విని నర్సింహారావ్ కదిలినాడుగా
నేరుగా చారుమజుందారునే చేరి సంప్రదింపులు జరిపాడు

....సై సై....

తెలంగాణ రైతాంగం నిప్పుల కళ్ళనిప్పుడు విప్పార్చింది
"దొరల తలలు ధూళిని దొర్లాలి దేశ్‌ముఖుల పొగరణిచెయ్యాలి
పొలాలు రైతుల చేజిక్కాలి ఊళ్ళు విప్లవం గూళ్ళు అవాలి
మేలుకొన్న ఈ గ్రామాలన్నీ కలిసి ఎర్ర ప్రాంతం కావాలి!"

....సై సై....

జిల్లా జిల్లా తిరిగాడండీ పార్టీ శాఖలు పెట్టాడండీ
గెరిల్లా దళం రూపొందించి గెలుపు లొకటొకటి పొందుతున్నడు
వీరయోధుడని పేరందాడు ధీరహృదయుడని మెప్పందాడు
విజయంలోనూ ఓటమిలోనూ పొంగని కుంగని సముచితుడురా!

....సై సై ...

ముఖాన చెరగని తన చిరునవ్వే నిత్య మల్లెపూవు చందము
మలినం ఎరగని మందహాసమే గాలికి ఆరని దివ్వె చందము
గుండె విప్పితే నిజాయితీరా గొంతువిప్పితే సౌమ్యతేనురా
కొండచిలువ నోడించాడండీ గోరువంకనే గోముజేసెను!

....సై సై....

తెలంగాణ మిలమిలలాడింది తెలంగాణ కళకళ లాడింది
తెలంగాణ రైతాంగం నిప్పుల కళ్ళనిపుడు విప్పార్చింది
నర్సింహారావ్ నడిచినమేరా హిరణ్యకశిపులు హతమయ్యారు
పొలాలు రైతుల పరమయ్యాయి ఊళ్ళు విప్లవం గూళ్ళయ్యాయి!

....సై సై....

సూరీడు

## 19

వరంగల్లు జిల్లా గురిమెళ్ళ.... నల్లగుంట ప్రాంతాన ఒక దినం....
తూరుపు దిక్కే అరుణ పతాక తూర్యారవములతో పక్షులు....
పందొమ్మిది వందల డెబ్బయ్‌రెండు మే మాసం పదకొండో తేదీ....
పోలీసు బలగం చుట్టుముట్టగా గెరిల్లా దండు పోరాడింది !

....సై సై....

## 2

చూపులో పులి రూపులో పులి
నడకలో పులి నడతలో పులి
పులి పులి పులి పులీ
ప్రజా-గెరిల్లా పులి— పోలీసు గుండెల చలి !

నవ్వితే పులి నరికితే పులి
ఘాటిలో పులి దాడిలో పులి
పులి పులి పులి పులి పులీ
ప్రజా-గెరిల్లా పులి— పీడితులెట్టే పొలి !

విల్లంబులతో బర్మార్లతో
వట్టిచేతితో గట్టి ఘాతితో
ప్రజాహింస మెడపై పంజాగా
ప్రజా-గెరిల్లాపులి— ప్రభుత్వ పీఠం చలి !

ఎండ వెన్నెలై వెన్నెల ఎండై
పగళ్ల రాత్రుల నొకటిగ గుచ్చి
సెగలొగల చిచ్చర కన్విచ్చి
ప్రజా-గెరిల్లా పులి— ప్రజా కంటకులు బలి :

## 20

వానలు తన వస్త్రంపోగులుగా
వాగులు తన జలకం నీళులుగా
సూర్యుడు గొడుగై చుక్కలు తోడుగై
ప్రజా-గెరిల్లాపులి— దొరలకు ఘోరకలి!

తూర్పు గాలితో ఓర్పును కలిపి
మార్పులోన తన ప్రాణం మెదిపి
మార్క్సు నిప్పుడు మావోగా నిలిపి
ప్రజా-గెరిల్లా పులి— రివిజనిస్ట్ ముఖం తెలి!

చీకట్లో తన కన్ను కాగడా
నిరాశలో తన తెన్ను ఆసరా
బతుకులో పులి పోరులో పులి
ప్రజా-గెరిల్లా పులి— ప్రజా వంచకులు బలి!

నగ్జల్బరిలో ఒకడు- శ్రీకాకుళాన ఒకడు
ముషాహరిలో ఒకడు ములుగు సీమలో ఒకడు
వల్లభ్‌పూర్‌లో ఒకడు నల్లగుంటలో ఇతడు
ప్రజా-గెరిల్లా పులి— హిరణ్యకశిపులే బలి!

ఒకడు నూరుగా నూరు వెయ్యిగా
వెయ్యి లక్షగా లక్ష కోటిగా
ప్రజావిమోచనసేన ధాటిగా
ప్రజా గెరిల్లా పులి— కొండచిలువ లిక బలి!

## 3

టం అపుడెలా సాగెను నర్సింహారావేమి చేసెనూ:
వరాళ్ల కంపిల్లాయండీ అడివే తనలో ఒదుక్కున్నది

పొడిచే పొద్దూ మూసుకున్నదీ మాను పూగడం మానేసింది
మోపెట్టాడూ చేతి తుపాకీ తుపాకి కాదది చిచ్చర పిడుగే •

....సైసై

మోతకన్నా ముందే ఒక శత్రువు మృత్యువాత పడిపోయాడండీ
చుట్టుముట్టుతున్న వారొక యిద్దరు గట్టి భూమినే ముద్దాడారు
చెట్టుకొక్కరై పుట్టకొక్కరై దుష్టులు దౌడు తీస్తున్నారు
చెట్టుకొక్కరై ప్రజా గెరిల్లా దిట్టలు రక్షణకై వెళ్లారు •

....సైసై..

బండ విడిచి ఇంకొక్క బండకీ చెంగుచెంగుమని దుమికాడండీ
బందూకొక్కటె తనకిక దిక్కు బందూకొక్కటే తనకిక తోడు
అరుగో విరోధులెరుగో శత్రువు లందరిలో తానొకే ఒక్కడు
ప్రభుత్వ తుపాకులన్నిటికీ తన ప్రజాతుపాకీ ఒక్కటే సరి!

....సైసై..

ఎరుపు తగ్గి తెలుపెక్కి సూర్యుడే ఎగిసి ఎగిసి పైకొస్తున్నాడు
తూరుపు అరుణపతాకం వర్ణం తగ్గి ఎండ తీక్షణం అవుతున్నాది
బాణంలాగా కళ్ళను గుచ్చెను వేడి హెచ్చెనూ వాడి హెచ్చెను
నిప్పుబంతిగా సూర్యుడు తొడలో చెప్పరాని మంటలతో దూరెను!

....సైసై...

కూలిన సింహం దేహం చుట్టూ అల్ప జంతువులు ముసిరి మూగెను
నేలబడిన వీరుణ్ణి చులకనగ గేలిచేసెను పోలీసహంకారి
లేవలేక కూర్చోనూలేక నర్సింహరావిలా చిక్కగా
"నీపేరేవిఁటి?" అని ప్రశ్నిస్తే, "లింగన్నను నేన"న్నాడండీ!

....సైసై....

రహస్యాలు రాబట్టాలని చీమచ్చి నానా ప్రశ్నలు వేసెను
బెదిరించాడు బతిమాలాడు గద్దించాడు గోము చేసెను
ఉక్కుగుండె ముక్కబోలేదు కంచుగోడ పెచ్చు విపలేదు
అగ్గిరాముడై దురహంకారి అల్పజంతువుల నెగవోలాడు·

...సైసై

గలీజు బుద్ధుల గూండా చేష్టల పోలీసు మూలగం పగబట్టాది
కిరాయి బతుకుల కసాయి తలపుల రక్కసిదండే పైబడ్డాది
తన శరీరమే తనదిక కాదు పిలిరి గెడ్డం గోళ్ళకి పిక్కెను
తన శరీరమే తనది కాదిపుడు రేచుకుక్కలా పళ్ళసి చిక్కెను

... సైసై...

ఎత్తిన పన్నీ మెత్తని ఒంట్లో మొత్తంగానే దిగబడెసియ్యా
హత్తిన పన్నీ మర్ళీ ఎత్తిదించిరి మర్ళీ ఎత్తి హత్తిరి
చిత్రహింసలే అనుప్పెట్టికి రాక్షసి కృత్యా లాచరించిరి
వేళ్ళన్నూడా తెగనరికారూ కాః ప్రస్తైలుప్పా చెక్కారు

.. సైసై .

దెందులూరులో తల్లికడుపున పేగొక్కటి మెలిబట్టాదింది
కొండచిలువ సంతృప్తి పడింది గోరవంక గురగురలాడింది
"యం. యల్. పార్టీ జిందాబాద్· ఇంక్విలాబ్ జిందాబాద్!"
కొండచిలువలకు గుండెలదిరెను గోరవంక ధైర్యాన తలెత్తెను

....సై సై....

పిడుగుపాటుకొక పర్వతశిఖరం విరిగి నేలపై కూలబడిందా?
చుక్కలు కిక్కిరిసినట్టి పుప్పరం చీలి నేలపై పేలికలైందా·
జీవనది ఒక్కటి ఎర్రఎండలకు చిక్కి ఎండి ఎడారయిందా?
చివరి కొమ్మతో ఆకసమంటే చేవమాను మొకటికి విరిగిందా?

....సై సై....

సాకీదు

ఇదిగో నెత్తురు వీరుని నెత్తురు అద్దు దీనిలో శక్తి పరాకం
ఇదిగో ఊపిరి వీరుని ఊపిరి నింపుకో ప్రజల హృదయశ్వాసం
పుట్టిన పొడిచిన సూర్యుడింతలో దేశమంతటా రానౌతాడు
విప్లవమోఘుడు ఇప్పుట గతించి వెలుగురాదవట నిత్యకాంతిగా

....సై సై....

ఎండ చూపు మిరుమిట్లు గొల్పగా చంద్రునిప్పుకణికలురాలుస్తూ
పందాడ్యాని స్వరూపం రెప్ప చాలోక్కలు కిరణాలు విదిల్చి
నెప్పురిలాగా ప్రజ్వరించుతూ దుమికిదాటుతూ ధిమిధిమిమంటూ
రాను రుద్రుడై సుర్యుడురానై దిక్కులు నాలుగు తొక్కివెయ్యడా?

....సై సై....

ఉగ్ర నారసింహావతారమై ఉరుకురాదుతే నర్సింహారాప్
ఉప్పెనుకునేదే ప్రళయాస్త్రై ఉరుకురాదుతే నర్సింహారాప్
దోపిడిదారుల గుండెలు జలదరించి హిరణ్యకశిపు హిరణ్యాక్షులైనా
నాయుడిన్న నంపెడి కక్కంగా చెల్లదీయగొరాడది తప్పదు!

# 5

లంగిరేజీ రాజ్యంలో
తెల్లదోపిడి రాత్రిలో పుట్టి
కాంగిరేజీ రాజ్యంలో
నల్ల దోపిడి రాత్రిలో పెరిగి - నర్సింహారావు
ప్రజా విప్లవ ప్రారంభాన
తూర్పు తెల్లని వెలుగు తానాయె
ఎర్రనెత్తురని బింబమేనాయె!

మహాకోడు

అడివిలోగల మాకులన్నీ
ఆకులను సమకూర్చి యిచ్చాయి
తొడకు సన్నీ పోటులన్నీ
నొప్పిపుడితే మందుపూశాయి - నర్సింహరావుకు
చల్లబరిచేట్లుగా నిమిరాయి
తల్లి హస్తస్పర్శ నిచ్చాయి

కొండమీదీ పిట్టలన్నీ
బృందగానం తాము చేశాయి
బంధుబృందంగా చరించీ
బాధలను మరిపింపబూనాయి - నర్సింహరావుకు
రెక్కలిసిరి గాలివీచాయి
ఈకలూడ్చీ పాన్పుకూర్చాయి

నెత్తురే ఒక బాటపోస్తే
త్యాగమే ఒక రేఖ గీసింది
బతుకులో నడగొండ కాగా
చావులో శిఖరాగ్రమై నిలిచె - నర్సింహరావు
జనం హృదయంలో మెదిలీ
చిరంజీవిగ వెలుగుతున్నాడు :

జూలై, 1973

సూరీడు

# మనిషి వయితే

మొరబెట్టుకో తల పగల మొత్తుకో
వరపడు సాగిలబడు మొక్కు-పొద్దులుండు
దీపం వెయ్ ధూపం వెయ్ నైవేద్యం ఇయ్
దాసోహమ్ అనుగ్రహించమను-

దాస్యాన్నీ దైన్యాన్నీ అసహ్యించుకుంటారే తప్ప-
దైవాలూ దొరలూ దయదలచరు దగ్గరకు దీయరు
వరాలివ్వరు కటాక్షించరు; చీదరించుకుంటారు

క్రిమో కీటకమో పశువో తిర్యగ్జంతువో
కాదలచుకుంటే తప్ప - మనిషన్నవాడు
తన హక్కు-కోసం తన్నులాడి గెలుచుకుంటాడు

అడక్కు అడుక్కు తినకు
తిరిపెం కడుపాకలి తీర్చదు - అంచేత
అదుం! గదుం! పురుం! చరుం!
ఆక్రమించు! ఆజ్ఞాపించు!
ఉత్సహించు! ఉద్యమించు!
విక్రముడివైతేనే విజయుడివౌతావు!

మహోర్జీలు చెదబట్టేందుకే పనికొచ్చేటప్పుడు
మహాయాత్రలు చెప్పులరిగేందుకే పనిజేసేప్పుడు
హర్తాల్ బంద్ ఘెరావ్ క్రియచూపనప్పుడు
కర్తలనుకున్న స్వాములే స్వావుల్లై అపహర్తలైనప్పుడు
లే! నిల్చో!
నడు! కలబడు!

30-9-1970

మావోడు

# నెరూడా! నెరూడా!!

భూగోళాన్నీ దాని నిర్భరమైన గండరగోళాన్ని కూడా
గుండెలకు హత్తుకొని చెప్పులనిండా నింపుకొన్నవాడా!
గృహనిర్బంధంలో మరి ఎన్నటికీ విడని వాగ్బంధంలో
కనుమూయవలసి వచ్చిందా చివరకు, పేబ్లో నెరూడా!

జగతికీ జగజ్జనతకీ రేయింబగళ్ళకీ రెండు సంజలకీ
జీవకాంతిని సజీవశాంతిని గాఢగాఢంగా కోరుకొన్నవాడా!
బాంబుల బందూకుల శతఘ్నుల దారుణ భాషణవింటూ
పారిపోవలసివచ్చిందా శ్మశాన ప్రశాంతికి, పేబ్లో నెరూడా!

జాతి విమోచన పోరాటాలను జీవిత సమరసూత్రాలుగా
నెత్తుటి గుండెకోతగాట్లుగా మార్చుకొన్న అక్షర మోహుడా!
చిలీ స్వేచ్ఛకీ యాంకీ దాస్యానికీ తుది పోరు మొదలైనప్పుడు
గెలుపోటములు తేలకముందే, దాటుకొన్నావేం పేబ్లో నెరూడా!

ఫేసిస్టు జాగిలాలవాడ కుందేలై చిక్కి ప్రాణం విడిచిన
ఫెడరికో గార్సియా లోర్కా సంప్రదాయానికి కవి వారసుడా!
జనరల్ పినోచెట్ తుపాకీగుండ్లు అలెండే గుండెల్ని చెండేప్పుడు
కేన్సర్ బాధని మించిన బాధతో బతుకు చాలించావా, నెరూడా!

స్పానిష్ శిశువుల లేతరక్తానికి ఫ్రెంచి త్రివర్ణ పతాకభంగపాటుకీ
ఫ్రాంకో దౌష్ట్యానికీ హిట్లర్ దౌర్జన్యానికీ కావ్యసాక్షి అయినవాడా!
సైన్యానికి మారుపేరైన చిలీసైన్యం కట్టుదాళ్ళు తెంచుకొన్నప్పుడు
దైన్యానికి మారుగా పిడులు ధైర్యం చూపేప్పుడా పోయేది, నెరూడా!

మారీదు

ఎడారి నైట్రేట్ గనిలో మాగర్భం బొగ్గు గనిలో ఒళ్ళు గుల్లయ్యే పనిలో
దుమ్మూ ధూళీ కొట్టుకొన్న మురికి ముఖాల్నీ దేహాల్నీ ముద్దాడినవాడా!
పనివాళ్ళ కూలిదాస్యంమీద బానిసెత్తు బోను మళ్ళీ మూసుకొన్నప్పుడు
ప్రవాసంలాంటి విస్మృతిలోకి పోకతప్పలేదా నీకు, పేబ్లో నెరూడా!

వాల్ట్‌విట్మన్ పేదసమాధి పళ్ళలపై నీ కంటి నీలాలను వెదజల్లి
ఏబ్‌లింకన్ చేగొడ్డలి వేళ్లకు చేవపాట పల్లవి కూర్చినవాడా!
తారల పులిచారల జండా కింద అంతర్జాతీయ దోపిడి దొంగల తండా
చిరత్పులై చిలీలేడి మీదికి లంఘించినప్పుడే పోయావేం, నెరూడా!

గిరికావ్య శిఖరం మీదనుంచి పదసగీతి మైదానానికి ప్రవహించి
గిటార్ వాద్య సంగీతానికి ఆడే పోరాడే గేయాలు రచించినవాడా!
తంత్రులు తెగి జీవితం శ్రవణ భేద్య స్వరాలు వెదచిస్తూంటే
తెంచుకుపోయావా దేశం బంధాలూ, జన సంబంధాలూ, నెరూడా!

కళ్ళ మీదపడి చెదిరే ఎండ మిరుమిట్లను చెల్లిన ఝళిపిస్తూ
కన్నెవెన్నెల బయళ్లపై పిట్టల్లా వాలే చూపులతో కాలాన్ని చూసినవాడా!
గద్దిగోళ్ల పట్టు తప్పించుకోలేక ఆక్రోశిస్తూ దేశం గిలగిలలాడేప్పుడు
కాలం గేలమై దేశం చేపైనప్పుడు, ఇప్పుడా పోయేది, నెరూడా!

అజంతమైన స్పానిష్ భాషచేత దీర్ఘహ్రస్వాచ్చులతో
అంతర్జాతీయ శ్రామిక మానవతకి మేల్కొలుపు పాడించినవాడా!
ముచ్చుమారల విచ్చుకత్తుల ముట్టడిలోనూ విప్లవ నినాదాలు వింటూనే
మనసుపడిపోలేదు కదూ గమ్యంలేని రమ్యంగాని అస్థితికి, నెరూడా!

నా స్వప్నారంభం మీద రగిలే రవల జడివాన కురిపించి
నా జీవిత కాలాన్ని దుష్కాలాన్ని మెరుపులతో చీల్చిన రాతగాడా!
పేబ్లో నెరూడా! పాటి చేవగల మాటల మేటి పాటగాడా!
నెరూడా! నెరూడా!!

1973, అక్టోబరు

28

# మావోడు సూరీడు

అటుకడలి ఇటుకొండ అదిచరియ ఇదిలోయ
అది బీడు ఇది చేను ఇది గుడిసె అది మేడ-
ఏక చీకటి వాతబడినది తూర్పు
మొక్కట్లు పట్టలేనట్లు అపటూప్ప

గుండెపై పెనురాతి గుండులా భారమై
గుదిబండలా మెడకు కాలికీ అడ్డమై
బతుకు గోరీవద్ద నక్కాగా రాత్రి
భూతకాలంలాగ తిష్ఠవేసింది.

వలస దుస్థితి తనకు పీడకల కాగా
భూస్వామికం గంటకత్తెరై నొక్కగా
చిరతపులి కొరికివేసిన జింక తూర్పు
చీడపురుగులు తిన్న వరిపంట తూర్పు

చేలు తోటలు రెండుకాళ్ళ పశువుల పరం
కూలి దోపిడి నాటు సీమ కుక్కల వశం
పొన్నుకర్రల బుడ్డపెత్తనం ఒకటి
బ్యాంకు పద్దుల గద్ద పెద్దరిక మొకటి

సాతాని గూటిలోఒక కీటకంగా
సింహాల గుహలోన మూగ జీవంగా
ఇంతకాలం తూర్పు తన ఇంట బంది
చింతలో వంతతో చచ్చి బ్రతికుంది.

సూరీడు

## 29

చీకట్లు వాడి విడిపోగా వేకట్లు పూడిపడిపోగా
చిగురు పసరెక్కులా ఉంది తొగరు రంగెచ్చులా ఉంది
ఎరుపెక్క సాగింది తూర్పు
కరుకెక్క సాగింది మార్పు

చలిముప్పు సూదిలాగేస్తూ తొలి నిప్పుమంట రాజేస్తూ
నిద్దరె కన్ను తెరవంగా బద్దకమె వెన్ను విరువంగా
జేపురేస్తూ ఉంది తూర్పు
నిప్పుపాదులా ఉంది మార్పు

కన్నిప్పుడు మొదగరిగేసు కాలు నడయాడ గలిగేసు
కలదెలసుకుని లేచి మనిషి కట్టుగడుతున్నాడు కలిసి
పాడులాపడ మింకమాని
పోరాడుతున్నాడు ప్రాణి

కొంప కొమ్మున నిలిచి ఎండ కోనలో పరదల్లు గట్టి
తడిలాగా చెంగలించి నెమలిలా పురివిప్పుతూంది
చెట్టుపుట్టలు బట్టబయలు
సీమపై దాని మెరుపుల్లు

ఎండజెండా ఎగురవేస్తూ వెండి జాటియ ఝుళిపిస్తూ
అంధకారం గొంతుకోస్తూ అగ్నిపును దిక్కులకు పూస్తూ
మావోడు [illegible]రీడు కదిలే
చాయుఫికటుడదే వెడలె

ఇటుకడలి అటుకొండ అదిచరియ ఇదిలోయ
అదిబీడు ఇదిచేను అదిగుడిసె అదిమేడ
ఈ కొండ కాకడలి అంటించె నిప్పు
ఈ లోయ కాచరియ అందించె ఉప్పు

15-12-1973

30

# పాపం, మైనా!

మాటలాడే పిట్టలంటే మాచెడ్డ ముచ్చట మనుషులకు
మార్క్సిజం మార్పిజమైతేం? సమకూరిందో మైనా ప్రశ్నేవుటి
అది పుట్టిల్లు విడిచింది గూటినీ మరిచింది, పాపం!
అయినవాళ్ళకందరికీ దూరమైంది - తన అనుస్వారమే శాపం !

ఆకాశాన్ని మరిచింది దాని నీల అగాధాన్ని మరిచింది
రెక్కలు తనవి తనకే బరువై గొంతుక తనది తనకే వింతయింది
తీన్‌మూర్తి భవనమైనా క్రెమ్లిన్ ప్రాసాదమైనా ఒక్కటే ఖైదీమైనాకు
ఇండియా అయితేం, రష్యా అయితేం, తనదిక పంజరబ్బతుకు!

ఉదయాస్తమయాలు గానీ, సూర్యచంద్రాదులు గానీ ఉండీ తనకు లేనట్టే
వాదోడూ వైదోడూ నేస్తులూ దోస్తులూ ఎవరూ ఉండనట్టే
పెంటితో సుఖించే యోగం, సంతాన యోగం తనకు ప్రాప్తించనట్టే
ఒంటరితనమే తనకీలోకం, పంజరమే గూడూ వల్లకాడూ!

ఇందిర పట్టింపించిన కానుక మైనా బ్రెజ్నేవును చూసి ఒదుచుకుంది
ఇంతెత్తు కమినిస్టయినా దాని ప్రాణానికి యమినిస్టే ననిపించినట్టుంది
సోషలిస్టిండియా నుంచి సోవియట్టు రష్యాకు పొందెతో కైలాసమెళ్ళింది
స్వేచ్ఛలేనప్పుడు స్వర్గమైనా రౌరవనరకమేనని కుమిలి కుళ్ళింది .

ప్రభ్వీణి ఆజ్ఞే తప్ప స్వజనం మాట నోటబెట్టేందుకు లేదు
ప్రతి గృహీతకు మానసోల్లాసం కలిగించాలిస్మి అని వ్రాత తాఖీదు
ప్రతిధ్వనిగానే తప్ప ధ్వనినంటూ తనవాణి వెలువరించరాదట
డిటో అవడమే తప్ప తనదంటూ సొంతమాట ఒక్కటి ఆడరాదట!

సూరిదం

"అభివృద్ధి పథాన ప్రణాళికా ప్రగతి సాగిస్తూన్న దే[హి]శం మాది
అంచేత కడుపులు మాడినా సరే, కార్మికులు సమ్మెలకు సమాధి
ప్రభుత్వమే ప్రజలకు పరమపదం చూపెడుతూ వున్నప్పుడు
ప్రతిపక్షాలంటూ ఏవీ అక్కర్లేదు" బ్రెజ్నేవ్ ఉపదేశం చెప్పాడు!

మాటలాడే పిట్టలంటే పల్లమాలిన ఇష్టం పిట్టలదొర కామ్రేడుకి
డిటో అనే అక్కుపక్షులంటే మరి చెప్పాలా! బ్రెజ్నేవ్ దొరగారికి!
మార్క్సిజం ఒకటెందుకింక! ఉభయులకీ మావో అంటేనే కినుక
మైనా కావాలిగాని పైనా చావాలి, పక్షి కావాలిగాని ప్రతిపక్షి హతమవ్వాలి!

డిసెంబరు, 1973

# 'దేవుడు' నిండుకున్నాడు

విరివి పెరిగి చిన్నెన్నై, ఎరుపు తెలుపు వన్నెన్నై,
సూర్యుడు చురకత్తులు విసురుతున్న వేళ—
నల్లటి రాయిలో బిగుసుకున్న పలుగురాతి ముక్కలపైన
వెల్లువ గట్టింది అశుభమూ శుభమూ ఎరగని నెత్తురు.

పరికిణి తొడిగిన పూమొగ్గ మీద పడింది పసరం పాదం
ఎడతెరిపిలేని కుతూహలం మీద దిగింది కారు నల్లని తెర
తలమీంచి మెడమీంచి ముఖంమీంచి కదిలే కాంక్ష మీంచి
నడిచింది భారీ లారీ టైరు చక్రం

తెల్లటి ఎండ.... నల్లటి రోడ్డు.... దానిమీద కూడా నల్లటి రక్తం
కొండెక్కి కూచున్న నామాలకోతి బండబారిన జిడ్డు విగ్రహం
గుండుగొట్టి పంపే 'దేవుడు'
నిండా వున్నాడు
నిండుకున్నాడు

11-5-1974

(కామ్రేడ్ మధుసూదనరావు పెద్దకుమార్తె దుర్మరణం తర్వాత)

## 33

# రారా! రా! రా!

ఇళ్లు విడిచి లోగిళ్లు వదిలి వాకిళ్ళు దాటి రా! రా!
ఇరుకు విడిచి కలుగు వదిలి వెలుగులోకి రారా!
సెగలుమిసే వగలూరే గోడల్ని విడిచి గాలిలోకి రా! రా!
పొగజిమ్మే పొరగమ్మే వాడల్ని వదిలి బయల్లోకి రారా!

కష్టం సహించి నష్టం భరించి గానుగెద్దులాగా చరించి
కర్మాన్ని నమ్మి ధర్మాన్ని అమ్మి బందెగేదెలా పసించి
మరెన్ని నాళ్ళ ఇకెన్ని ఏళ్లు కారుస్తావు నీ కంటినీళ్ళు?
మనిషివే గాని మహిషమేం కావు, మరి చేతబట్టు కరకుకొడవళ్ళు!

ఎదిరించి నిలువు పోట్లాడి గెలువు కుంగటం కంటె పొంగటం సులువు
కదిలితే వాగు కదిపితే పిడుగు చెయ్యి పైకెత్తితే మిన్నులే ఒరుగు
కలవాడు కూలబడిపోయేటోడు, లేనోడె గెలిచి నిలిచేను చూడు
బలవంతమైన సర్ప మేదైనగాని, చలిచీమలకు లోకువయ్యేను చూడు!

గబ్బిలంలా ఇంటిలో కప్పు కంటుకుని వేలాడుతూవుండి లేకుండి ఒక్కటే
గొర్రెలా కసాయివాడినే నమ్ముకుని బతుకుతూవుండి లేకుండి ఒక్కటే
చాలు శోకా లింక చాలు రాగా లింక చాల్చాలు నష్టకష్ట-ఐశ్వర్యాలు
వాల్మీకులా చెయ్యి విదిలించి చూసుకో: పోరాటం పిలుస్తోంది తెలుసుకో!

18-5-1974

# సూర్యుడు గెలిచిన కథ

వెన్నెలను చిదిమివేసి
        చిగురు వెన్నెలను చిదిమివేసి—
చీకట్ల గోయితీసి
        ముదురు చీకట్ల గోయితీసి—
శిశుశశిని పాతివేసి—
        నవ్వుశిశుశశిని పాతివేసి—
రాత్రినే సాగదీసి
        ఘోరరాత్రినే సాగదీసి
        వెలుగునే ఆర్పగలవా
        వెంగళీ !
        నే వెలుగు నడ్డగలవా ?

కిరణాల తాళ్ళు లాగి
        వ్యూహ కిరణాల తాళ్ళులాగి—
చరణాకోలలు విదిల్చి
        ఉత్సాహ చరణాకోలలు విదిల్చి—
గుర్రాలు పరుగెత్తగా
        పోరాట గుర్రాలు లగువెత్తగా—
రాత్రి గోరీ పగిల్చి
        దోపిడీ రాత్రి గోరి పగిల్చి—
        అరుణు డుదయిస్తున్నాడురా
        క్రాంతి
        అరుణు డుదయిస్తున్నాడురా !

మూర్తి

చట్టాల పాశాలతో
క్రూర చట్టాల పాశాలతో—
ఆయుధాగ్ని జ్వాలతో
మారణాయుధాగ్ని జ్వాలతో—
ద్వేష హింసాకాండలో
వర్గ విద్వేష హింసాకాండతో—
వంచనా తంత్రాలలో
ప్రజా వంచనా తంత్రాలతో—
సూర్యునే ముట్టగలవా
ఓ భడవ!
సూర్యగతి నాపగలవా?

కిరణాల జనసేనతో
సంచార కిరణాల జనసేనతో—
కొండదిగి కోనదాటి
తూర్పుకొండ దిగి కోనదాటి—
ఊళ్ల గుండెలు రగిల్చి
పల్లెటూళ్ల గుండెలు రగిల్చి—
పట్టణాల ముట్టడించి
సంపన్న పట్టణాల ముట్టడించి —
రాజ్యమేలును సూర్యుడే
ప్రజల
రాజ్యమేలును సూర్యుడే!

సికిందరాబాదు జైలు
14—7—1974

# గుండె బలం

మా గుండే మా జెండా ! మా మనసే మాకండ !
మార్క్సిజమే మా పథం ! మావో వజ్రాయుధం !

హృదయబలం లోపిస్తే ఆయుధబల ముంటేనేం ?
ఆయుధాని దేమున్నది ? నిబద్ధత ఒకటే పెన్నిధి !
చచ్చుమనిషి చేతిలోన హెచ్చు ఆయుధాలుంటే
సాహసి చేతికి వస్తై సొంతదార్ని లొంగిస్తై !

ఆయుధాలు అధికారం అంగబలం ఎన్నున్నా
పంథా సరికానప్పుడు పడక తప్ప దెవడైనా !
బక్కఎముకలోని శక్తి రక్కసినే చంపగలదు
రైతుకూలి ఉద్యమిస్తే రాజ్యం రాబట్టగలరు !

మా గుండే మా జెండా ! మా మనసే మాకండ !
మార్క్సిజమే మా పథం ! మావో వజ్రాయుధం !

సికిందరాబాదు జైలు, 1–7–1974.

.సూరీడు

# వాన తర్వాత

మబ్బా మబ్బా ఈమాట చెప్పా :
నీతోని ఆనీరు ఏకూల కొచ్చెను.
నీ దూది పదలికలకే గమ్యముందేను ?
మబ్బా మబ్బా. మరి బదులు చెప్పా !

మబ్బా మబ్బా ఒకమాట వినరా :
రైతు కంటికి వత్తులేసుకుని చూసేను
కూలి వంటికి చెమట జలకమే మిగిలేను
కమిలి కుమిలిన నేలకౌగిలి మెప్పుదారేను ?

మబ్బా మబ్బా చెవినొగ్గి వినుకో :
నామాట విని సముద్ర తీరం వైపు
కదలి నీవని పిల్చి చదలంత పరచుకో
వానలా కమ్ముకొని మామీపై కురిసిపో !

మెడపై పొలుగుపై తడిసి రాలిపడాలి
గుడిసెపై జల్లుపై చినుకు చిలికింపాలి
ఖామందు మూపై పదాలులు పరవాలి
గోచిపాతలవారి కొక కప్పు కూడాలి !
ఉప్పొంగిన పట కత్తి అంచులలో
కటుకుగోసిన కొత్త కొడవళ్ళు జళిపించి

క్రూర రాక్షసరాత్రి కంఠ రక్తములోన
కాలమే పులుగడిగినట్టి ముత్తెమవాలి :
ప్రళయమో వర్షాన వృక్షాలు కూలగా
పచ్చికలు తలయెత్తి పరవశం చెందాలి !

మాహోదు

మిట్ట పల్లా రొక్క సమతల మయేలాగ
కష్టకాలం గడిచి బతుకు ననలెత్తాలి :

మబ్బూ మబ్బూ చేతిలో చెయివెయ్ !
మబ్బూ మబ్బూ కోరింది చేసెయ్ !
విధ్వంసనం వినిర్మాణానికి పునాది
విప్లవ మహావృష్టి పిపప నూతన సృష్టి !

సికిందరాబాదు జైలు, 1–7–1974

సూరీడు

# గెరిల్లాల పాట

తుపాకి విద్యకు నవ్యసాధకులం మేమంటారా, సత్యం !
ఒకొక్క తూటా కొక్కొక్క శత్రువు మన్నుగరవడం తథ్యం !
రెక్కలు మొలిచిన సైన్యం మాది
గిరి ఝరికీ వెరవనిది !

సాంద్రాటవులలో మా క్యాంపులు సహస్రాశ్రయాలున్నై !
ఉన్నత పర్వతాల ఎత్తులపైన, దుర్గమ శిఖర స్థలాలలోన
సోదర లోకం సంఖ్యాతీతం
సమరం సాగిస్తుంది !

తిండికి బట్టకు కరువైతేనేం ? మా కవి శత్రువె సమకూర్చేను !
తుపాకి లేకుంటేనేం ? వాడే చేతుల కందించేను !
రిటెగట్ట, మా అందరిదీ ఇది : ప్రతి అంగుళమూ మాదే !
ఒండెత్తే ప్రతి ఒక్కనితోటి తుదికంటా పోట్లాటే !

సికిందరాబాదు జైలు, 18—7—1974

[ జపాన్ వ్యతిరేక యుద్ధకాలంలో దక్షిణ - పశ్చిమ చైనా హునాన్ రాష్ట్రం లోని కమ్యూనిస్టు గెరిల్లా యోధులు పాడుకున్న పాట. దీని ఇంగ్లీష మూలం హాన్‌సుయిన్ పుస్తకం 'బర్డ్‌లెస్ సమ్మర్'లో ఉంది. ]

# గాలి మారింది

ంగిరిపోతున్నాయి నేలమాడి బొగ్గవుతూంది
బీళ్లవుతున్నాయి పచ్చదనం నల్లబడుతూంది
ఎండాకాలం ఎన్నాళ్లు, ఎన్నడు మబ్బుల ముట్టళ్లు ?
ఎండిన చెఱువులు ఎన్నాళ్లు, ఎప్పుడు చేపల సందళ్లు !

నేలబీట లింకెన్నాళ్లు, ఎప్పుడు నీటవడి పరవళ్లు ?
'తెల్ల భయం' మరి ఎన్నాళ్లు, పిల్ల పిడుగులా చప్పుళ్లు ?
వుక్క పంజరం మరెన్నాళ్లు, ఎపుడు గాలి తడి రాకిళ్లు ?
కరువుకాటకా లెన్నాళ్లు, కటకట లింకా ఎన్నాళ్లు !

కూలిచాకిరీ ఎన్నాళ్లు, తొలిగే దెప్పుడు కడగళ్లు ?
అణిగి పడుండడ మెన్నాళ్లు, ఎన్నడీ విషం విరుగుళ్లు ?
పిష్టవాల ఋతువొచ్చింది, కార్తెమూల మబ్బేసింది
గాలి వాలకం మారింది ఎర్రదుమ్ము చెలరేగింది

సికిందరాబాదు జైలు, 25-7-1974

# 41

# ఎగరేశాం

ఎగరేశాం ఎర్రెర్రని జెండా
జైలయినా ధైర్యం విడకుండా,
ఆశయాల రోజా పూదండ ।

మృతవీరుల ప్రాణార్పణ ఫలితం
సాయుధ ప్రజాయుద్ధ జ్వలితం
విప్లవ శక్తుల ఉద్యమ మహితం ..ఎగరేశాం..

ఎగరేశాం ఎర్రెర్రని జెండా '
మబ్బులు పట్టిన దిక్కులగుండా
కొత్త కరుకు చురుకెక్కే ఎండ ..ఎగరేశాం..

కలిగినవాళ్లకు గుండె దల్లడం
దుష్టశాసకుల అస్థిలో జ్వరం
కష్టజీవి మెడలో జయహారం ...ఎగరేశాం.

ఎగరేశాం ఎర్రెర్రని జెండా
మనిషి పి. చూస్తాపుండ
నిర్భయ నిర్ణయమే ఎటనిండ ...ఎగరేశాం...

పీడితజన ఆశా మందారం
జనయోధుల పోరాటాంగారం
భావికాల లత ప్రాణాధారం ...ఎగరేశాం...

దాస్యయుగానికి చరమాధ్యాయం
స్వేచ్ఛాజీవిత గృహ ప్రవేశం
మానవీయ చరితకు శ్రీకారం ... ఎగరేశాం...

సికిందరాబాదు జైలు, 28–7–1974

[ చారు మజుందార్ సంస్మరణ దినం ]

మావోడు

## 42

# పిట్టలే నయం

పిచికలకూ పిట్టలకూ కాకులకూ గద్దలకూ
ఆకాశం విశృంఖలం అవకాశం విపులం.

ఉన్నచోటనే ఉండక వుషారుగా షికారుగా
రెక్కలిప్పి ఆడిస్తూ రెప్పలెత్తి పరికిస్తూ
నిత్యచలన శీలంతో నిర్నిబంధ వర్తనతో
కిందనున్న ఖైదీలకు ఈర్ష్యకలుగ విహరిస్తూ
మనుషుల చెరసాలలకూ మనుషుల పనిసాలలకూ
ఎంతో ఎత్తునపోతూ ఎదం తొలిగి పయనిస్తూ
ఉన్నతినీ విస్తృతినీ సాధిస్తూ శ్రమించేటి
పిచికలకూ పిట్టలకూ కాకులకూ డేగలకూ
విశృంఖల మాకాశం అవకాశం నిరవధికం.

సికిందరాబాదు జైలు, 22-9-1974

సూరీడు

43

# కన్నతల్లి

చంద్రుడికి తల్లి భూమి
చందనం కాదు, మేనంతా మసి పూసుకుని వుంది
పంటలకు దాది భూమి
పచ్చనతో కాదు. బూడిదరంగుతో కప్పబడింది

ఒంటికి చింకిపాతలు చంకన జోలె
అరిగిన కాళ్ళు కాయలుగాచిన చేతులు
ముడుచుకుపోయిన ముఖం ముడతలుపడ్డ పొట్ట
దుమ్ముగొట్టుకున్న జుట్టు దేహీ అనే నోరు
ఎండిన రొమ్ములు వణుకుపోయిన కాళ్ళు
[illegible]లైన గోళ్ళు పాచి పళ్ళు

చెయ్యిపట్టి నడిచే ఎదబిడ్డ చంకన చంటిబిడ్డ
నెత్తిన [illegible] ఒరిగిన అంగిలి
పిడచగట్టిన నాలిక ఎండిన గొంతుక
ఓరిమిని [illegible] ఇంటింటికి తిరగాటకం
అన్నీ [illegible]డిగిన [illegible] నడిపేసుగ
అంతా ఉన్న ఏమీలేని గుడ్డి బిచ్చగత్తె

చంద్రుడికి తల్లి శ్రీదేవి చెల్లి ఈ భూమి
గంధంతోకాదు దుర్గంధంతో నిండింది.
సంపదలకు పెట్టని నిధి
శోషతో మూర్ఛిల్లిపోతూంది.

24—9—1974

44

# అ - క్రమం

క్రమం తప్పడంలో కూడా
క్రమం ఒకటి ఉంది .
గందరగోళం తాళం ,
లయ పాటించే విలయం !

అలజడి చేసే సందడి,
అవ్యవస్థపైని ఆస్థ,
అశాంతిలో సాఫల్యం,
ఆత్మార్పణ ఆకర్షణ !

ఉద్విగ్నత హృది నగ్నత,
వుత్సాహం వ్యామోహం,
ఉన్మాదం జయనాదం,
ఉల్లోలం కల్లోలం !

పటపగలు పిడుగులజడి,
పూరేకుల బాకువాడి,
కదిలే బాద, నడిచే గుహ,
కలవర పెట్టే తహతహ !

శ్మశానాన శ్రీ వెన్నెల,
సొరంగాన మృత్యుహేల,
హర్యక్షం సూదికనుల
హఠాత్తుగా క్రూరజ్వాల !

సూరీడు

నిలకడ పొందిన నీడలు
నీటిని కదిలే జాడలు,
గాలిచీటి చివరివ్రాళ్ళు,
కాంతి పేనినట్టి త్రాళ్ళు !

తారల మీటలు పంపే
తరళ రహస్య వార్తలు,
వనవాయు ప్రసారాన
విడిబడు సంకేతాలు !

క్రమం తప్పడంలో కూడా
క్రమం ఒకటి వుంది !

స్వాతి, 1970 సెప్టెంబరు

# రగతం

వరంగల్లులో చికాకొల్లులో కరకు కసాయి కటికి సిపాయీ
జెంగం బంగం జముని పటాలం జరిపే ఘోరం విని సహించడం
ప్రజాతంత్ర జీవన మర్యాదా ?

హింసలు ఖైదులు హత్యాకృత్యాల్ హజమూ జులుమూ అత్యాచారాల్
నేరం మోపని న్యాయంతీర్పుని నరుల దుర్వ్యధలు నరకయాతనలు
ప్రజాతంత్ర శతపత్ర దళాలా ?

ఎరుపెక్కాయ్ రక్తంతో కొండలు బిరుసెక్కాయ్ బాధలతో కోనలు
వన్యమృగాలే విన్నబోయినై వృక్షాలే నిష్పక్షాలయ్యాయ్
ప్రజాతంత్ర దుస్తంత్ర సాక్షులై !

ఏటినీటిలో యీదే చేపలూ ఎగిరే వన్నెల చిన్నెల పిట్టలు
గాలీ వెలుతురూ కాలం స్థలమూ గొంతుచించుకుని ఘోషిస్తూంటే
ప్రజాతంత్ర రక్షకులకు చెవుడా ?

రామ రామ ! ఇది రామరాజ్యమా ? రామరాజ్యమా రక్తభోజ్యమా ?
రక్తకబళమా రక్త యజనమా ? రక్త యజనమా రక్త పానమా ?
ప్రజాతంత్రమా ? పశు జృంభణమా ?

1975

# చూడు రేఖల్లోకి !

ప్రవాహగతి సాంతం మారుతుందనీ
ప్రధాన స్రవంతి 'సస్మరంతి' అవుతుందనీ
తెలుసా ?
అక్కడ ముందుముందు చుక్క పూరదు
నలుసుల్లనులుగా యిసక మేటలే మిగిలేగి
పాయగా పొరగా పారుతున్నాయనా నీ ఊహ ?
పాచిబట్టి చెలమ లవుతున్నాయనా, నాయనా ?
ఊరికి కానా దూరంగా పూటికి కానా యెగువగా
పుడుతూంది పవిత్ర నర్మదా ప్రవాహం ?
సూచనగానే కాదు సూది మోపినట్టూ కాదు
బలపడుతోంది భీకరాకారం ధరిస్తోంది.
కనుజూపుంటే చూడు ! లేదా ?
నట్టేట్లో బుడుంగు బుడుంగున జలకాలాడు !
ఏటి కెదురీదడమా ! నీ తాతల్దిగి రావాలి !
నొప్పిరాక న్నమ్ముకుని దృష్టికి నష్టి కలిగించుకుని
దెబ్బతౌతున్నావు గాని.
ద్రష్ట ననుకుంటూ, ప్రవక్త వేషం కడుతున్నావు
ప్రవచనాలు నోట బెడుతున్నావు
దద్దమ్మ' కు నీ ప్రతిపనీ నిదర్శనం
'గాకు నీ ప్రతి మాటా తార్కాణం.

'ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రిక' 11-12 19[illegible]



# చెలియలి కట్ట

అనంత విశ్వాంతరాళాన ఒకానొక సన్నటిచుక్క
అత్యుష్ణ మహాగ్నిగోళం బద్దలైన చిన్న నిప్పుకణిక
మాహేంద్ర నీలాలమాలలో మరకతమణి
మహార్ణోరాశిలో దీవి - మనం జీవించే ధరణి
ఊయల డోలికైనా శవపేటికైనా మనకిదే సర్వస్వం
కాలిపట్టూ కలలుగుట్టూ మనకు ఈ భౌతిక విశ్వం—

ఇది - విధిచేతి జంత్రపు బొమ్మకాదు
ఇహం అసంబద్ధ పరలోకచ్ఛాయ కాదు
విధాత్మని లీలకాదు మాయకాదు మర్మమూకాదు
వాస్తవాతివాస్తవమేగాని వాస్తవాధివాస్తవం కాదు
నిరంతర ప్రవాహిని పరిణామ ధర్మిణి - అవని

ఆదిలో ఆకార రహితమై పడివుండేది ప్రకృతి ఇక్కడ
అద్దానికి అద్దమే తోడుగా ప్రతిబింబమేదీ లేకుండా—
ఆరుతూ మండుతూపోయే అనంత జీవజ్వాల
అంకురిస్తూ అంతరిస్తూ సాగే నిర్విరామ ప్రాణహేల.

జననం మరణం వృద్ధీ క్షయం
బహిరంతర సంఘర్షణామయం
క్షణం క్షణం నవీనతావిష్కరణం
సూక్ష్మంనుంచి స్థూలం కణంనుంచి జీవజాలం—
స్థాణువు కాదు ప్రకృతి, నిశ్చలతకాదు స్థితి,
అది ఊర్ధ్వముఖ పురోగతి.

సౌర చాంద్ర గ్రహ నక్షత్ర ఆకర్షణ వికర్షణల్లో
పరిసర వాతావరణ శీతోష్ణాల్లో పదార్థ ధర్మనియమాల్లో
పంచ మహాభూతాల సంసర్గఫలం అగణ్య జీవజాలం
దివారాత్రాల సంక్రమణంలో ఋతుచక్ర భ్రమణంలో

వైవిధ్యం సుందరం ప్రాణబంధురం—
సాగరాలు పర్వతాలు నదులు అడవులు
క్రిములు కీటకాలు చేపలు పక్షులు పశువులు
మనుషులు !

అరణ్యం ఆవాసంగా గుహ గృహంగా శాఖామృగంగా జంతువుగా
ఆదిమానవుడు ప్రకృతికి అధీనుడు ప్రాకృతజీవనుడు
మూలప్రకృతిని భిన్నాకృతులుగా తనలో పరావర్తనం చేసుకుని
పునఃప్రకృతిని జ్ఞానమయ చైతన్యకోశంగా మార్చుకుని—

అవయవాలు పరికరాలుగా అనుభవాలు ఆచార్యులుగా
ప్రకృతికి లోబడీ ప్రకృతితో తలబడీ
సర్దుకుపోతూ సంఘర్షిస్తూ—

మృగతుల్యుడైన వానరుడే నరుడుగా రూపొందాడు
ముంగాళ్ళను చేతులుగా కళ్ళను జ్ఞాన జ్యోతులుగా మార్చుకున్నాడు
జ్ఞానేంద్రియాలతో సమకూర్చుకున్నాడు ప్రపంచానికో అర్థం
జీవన సంగ్రామంలో సమిష్టి ప్రయత్నమే పరమార్థం—

వాడిదే ఈ అద్భుత సృష్టి, కాదు అభూత సృష్టి,
అల్పానల్ప ప్రక్రియాసమిష్టి కాదు ప్రతిసృష్టి

అరణ్యంగా అరాచకంగా అసంకల్పిత కార్యరంగంగా
కడలిగా కల్లోలంగా అనియంత్రిత సహజ భీకరంగా
పథకహీనంగా ప్రయోజనశూన్యంగా ఉత్పాతంగా విఘాతంగా
ప్రకృతి ఘోరాకృతిగా స్థితి నిత్యసంశయాన్వితంగా

దౌర్జన్యరాజ్యం పర్జన్యగర్జనం భూప్రకంపనం
కుంభవర్షం జలప్రళయం దుర్భిక్షం
క్లేశం ఆక్రోశం దుఃఖం దారిద్ర్యం సంఘాతమరణం
దైన్యం—

గాలిలో పెట్టిన దీపకళికగా కొట్టుమిట్టాడేటప్పుడు
జీవం క్షణభంగురం నశ్వరం బుద్బుదమనిపించేప్పుడు
జ్ఞానమే అంకుశంగా విజృంభించాడు సింహంగా
ప్రకృతి మత్తేభం కుంభస్థలంమీదికి ధిషణాధికుడు
నరుడు.
శక్తితో యుక్తితో మచ్చిక చేయబూనాడు జాంతవాన్ని—

సమిష్టి శ్రమనుంచి బుద్ధిపుట్టి
మెదడు పెరిగి పరిజ్ఞాన ధని
హృదయ సంస్కారంతో కళాధుని
బహిరంతర పోరాట ఫలితం
మానవాంతఃకరణం.

సహజానికి ఇతర మానవుడు కల్పించిన కృత్రిమత
బుద్ధి సూక్ష్మత భావసుకుమారత - వెరసి నాగరికత :
ప్రకృతికీ మనిషికీ మధ్య పరచుకున్న విశాల రథ్య
విశృంఖలతకు అడ్డుకట్ట దృష్టాదృష్టాల నడిమిగండి
విజ్ఞాన - కళాన్వితమైన సంస్కృతి.

ఇంద్రజాలం కాదు మంత్రం తంత్రం కాదు మానవ నిర్మితి
ఇంద్రచాపంలా నెమలిపురిలా మణిదీపంలా అందమైంది
మహానుభవశాలి మానవుడు మహానుభావుడు మానవుడు
మార్పుమీద తలపు కొత్తమీద గురి - అభ్యుదయ సాధకుడు

కీడునుంచి మేలు ఘోషనుంచి భాష
నిరూపం నుంచి సురూపం
కల్లోలినిలోనుంచి కల్హారం
గానం శిల్పం నృత్యం తత్వం నీతి
ప్రియ యోచన భావుకత
సప్త నాట్యం...

ప్రకృతి కర్తకాగా స స్కర్త మానవుడు
ప్రకృతి కర్మకాగా నిర్విరామ క్రియ మానవుడు

అదుపు కురాని వన్యజంతువు ఆదిప్రకృతి
ఆజ్ఞాబద్ధంగాక స్వాధిక్యంతో ప్రగల్భ భూతశక్తి
అదును దెబ్బ తీస్తూనే వస్తూంది సంబద్ధ మానవ నిర్మితిని
చిదిపి చెరిపివేస్తూనే వస్తూంది సక్రమానుబద్ధ పద్ధతిని

ఆదాత్తుగా విపత్తుగా...
వాన వరద ఎండ చలి
వండ వడ వుప్పెన గాలి.

శోభను క్షోభగా శేదాశాన్ని పూసర క్షేత్రంగా పరిమారుస్తూంది
భవనాన్ని నేలమట్టం చేస్తూ బతుకును బద్దలు కొడుతూంది
నీళ్ళలో నిప్పుమంట లేపుతూ నేలను చీలిక పేలికలు చేస్తూంది
గాలిని వురితాడుగా పేనుతూ కాంతితో జీవసంహారం కావిస్తూంది
క్షేమాన్ని గాయపరచి ప్రాణాన్ని తుంచిపోసి బీభత్సం కలిగిస్తూంది...

సహజానికీ సంస్కరణకూ తీరని పోరు
పశుప్రకృతి మానవుని పోటీదారు.

ప్రతి సంక్షోభమూ మానవకోటి మనుగడకే పెనుసవాలు
శిథిలాల మీద శకలాలమీద హృదయనిర్వేదం నేత్రాలు
ఏం చెయ్యాలి మనిషి? ఏం కావాలి ఎంత కృషి?
ఏ పరాశక్తిమీద వెయ్యాలి తన బరువూ బాధ్యతా?

మాతా గాదూ మానూ గాదు మనిషి రాయో రప్పో కాదు
మూర్ఖుడై మానవతను హృదయహీన వస్తువుకి ఆపాదించాడు
ఆనందం కరువై అనాథ శిశువై నిస్పృహా పొందుతున్నాడు
ఆశలూడ్చిన తరువై మోడుచేతు లెత్తి నమస్కరిస్తున్నాడు
దుర్విధి అవునా? ఇది దురంతమేనా?

సహజాతిసహజమైన ఘటన సైతం మనస్సును [illegible]స్తోంది
విహ్వలిస్తున్నాడు హృదయమున్న మనిషి
ప్రకృతికి హృదయమూ లేదు మేధస్సూ లేదు
పరుషమై ప్రళయమై క్షణంలోనే ప్రశాంతం కాగలదు
చండిగా చెండాడి చల్లగా దీవించగలదా? మారి మాత కాగలదా?
అంతా తన భ్రమ! అంతే గాని, ధర్మకాదు
అనధీన మహాసత్వం ప్రకృతి
అది వట్టి పదార్థం అనియతశక్తి
అయితే, అలాగే వుండిపోనీరాదు!

మనిషి విజేత
అనతిక్రమణీయం నాగరికత చెలియలికట్ట
క్రిమికాదు మనిషి
మహోద్యమం శేముషి
సంకల్పబలం మనిషి
మనిషంటేనే మనస్సు
మనిషంటేనే మహస్సు

భారతి, నవంబరు, 1978

[బందరువద్ద ఉప్పెన వచ్చిపడిన ఆరునెలల కంటే ఎంతో తర్వాత]

సూర్యుడు

# మనిషిని చూడబోయ్యాను

గుహలోని సింహాన్ని చూసివద్దామని వెళ్లలేదు
ఊరేగే ఉత్సవ విగ్రహాన్ని తిలకిద్దామని ఆశించలేదు
కేసరి ఎదురౌతుందని కలలోనూ అనుకోలేదు
విగ్రహం సాక్షాత్కరిస్తుందని ఏనాడూ నమ్మకోలెదు.

హర్యక్షం సమక్షంలోనూ అల్పమృగం కాబోను
దైవ ప్రతిమ సన్నిధిలోనూ దాసోహమ్మననేరను
నేను నేనుగా నిలవడ మెుకటి స్వాతంత్ర్యపు కోరిక
వ్యక్తివాదమైనా అది ఆత్మగౌరవం సూచిక !

చివరకు నే జూచిందొక సింహం కానేకాదు
ప్రాణదీప్తి లోపించిన శిలాకారం కూడ కాదు
బండబారిపోని గుండె చిక్కబడని తేటతలపు
వజ్రదీక్ష సుమస్పర్శ అగ్నిధార హిమజ్వాల !

మానవుణ్ణి చూచినాను మానవతను తూచినాను
మమత సమత కన్నులైన మనిషినె నే గలిసినాను
మనిషి అతడు : కాడొక ఋషి
కాడు ద్రోహి : అతడు మనిషి !

8—1—1974

# ఉదయానికెదురు నడుస్తున్నాను

సముద్రం ఏచుగాలికి చల్లటి వీపుని చూపి
సత్తువ వుడుగుతున్న సూర్యుణ్ణి చెమటకాళ్లతో తాపి
నెత్తురుగక్కే పడమటి దిక్కుని ఛీత్కారంతో చూస్తూ
నడుచుకుపోతున్నాను ధిక్కారం ప్రదర్శిస్తూ.

పొద్దుట కుళాలాగా చెంగలించిన ఎండ తువ్వాయి
మధ్యాహ్నానికల్లా కారెద్దిరిగిన పోట్లకోడె—
పొద్దువాలే వేళకు దాని వయస్సు కైవాలింది
ఎత్తుబడినట్టు నల్లగప్పువేసి నేల గూలింది.

కిందినుంచి కావిర్లు పైకెగిసి, సూర్యబింబం
కరిమింగే వెలగపండై హరించుకుపోతూంది—
పడిపోతూన్న వ్యవస్థ అచ్చుకుమచ్చు గుద్దినట్టు
ప్రతిరోజూ లోకానికి ప్రత్యక్షమౌతూనే వస్తూంది.

గాలి గుమ్మటంలాంటి పూర్ణ సూర్యుడొక్కింతలో
గుల్‌గుంబాజ్ లాగుండి చిక్కి నగమవుతున్నాడు—
తగ్గి శిరస్త్రాణం, తలపాగా, తురాయి, కందినరాయి అవుతున్నాడు
తర్వాత, రూపం నశించికూడా రశ్మిగా వ్యాపిస్తున్నాడు.

## 55

మార్పు మొనజూపాలిగాని, మరి, అది పుప్పెన ముంపే
మంచమైనా పట్టక ఒక్కపెట్టున 'హరీ' మంటాడు రోగి
ముడతల రాత్రి మసిపాతలో ముడిచిన ఉత్తమ వజ్రం
మరో దినకరుడై మరింత కరుకుదేలి రావడం తథ్యం !

ఎదురుగాలిని దూసుకుపోటూ రేపటి సూర్యుడి వైపుగా
ఎల్లలోకంతోటి సమేకమై నేనూ ఎదుర్కొస్తున్నాను
అస్తమయాన్ని నిబ్బరంగా నిన్ననే ఎదిరించినవాణ్ణి, నేనిప్పుడు
నిస్తుల నవోదయానికై నడుస్తూ వింటున్నాను కదలి కడుపు చప్పుడు !

26—3—1974

# రేపటి గాలిపాడే పాట...

I cannot imagine anythıng. . but I hear the wınd, the Great Wınd of Tomorrow, sing ıts Inemendous song...

—హాన్ సాయిన్

రేపటిగాలి పాడేపాట నేడే వినవస్తున్నది
గుండెలు కదిలిస్తున్నది

ఏడుపులాంటి గాడుపుకాదది, నిర్భర యవ్వనకవనం
మూలుగులాంటి వాయువుకాదది, సాయుధ గీతాపవనం . రేపటి....

ఆకులు రాల్చి మోడు మిగిల్చే పోడుగాలి కాబోదు
బతుకులు వేల్చి కడుపులుకాల్చే నిప్పులగాలి కాదు ....రేపటి. ..

ఈలపాటతో సవిలాసంగా నడుచుకుంటు పోయేది
చిగురెత్తిస్తూ నగవొలికిస్తూ చలచల్లగ తోలేది ... రేపటి.. .

చలికి ఆకలికి నిరుపేదల బలిగోరి చంపగారాదు
ఎండుటాకులను ఊడ్చి మింట సుడి తిప్పికొట్టగాబోదు .రేపటి....

సాయుధమైనా భీషణమైనా జనకంటకులకె గాని
సాధు సుందరం స్వాదుకోమలం జనహృదయాలకు రాణి ... రేపటి....

చెమటలు పట్టిన నొసటికి చల్లటి చేతి తాకిడయ్యేది
పనిలో మునిగిన కష్టజీవులకు సేదదీర్చబొయ్యేది ....రేపటి....

రక్షకులకే పనులు బెట్టి
ఆయుధా న్నధికారి జేసీ ....రాళ్ళు....

ఉదయకాంతిలో సాగరాలపై నురుగు తరగగా పొంగి
విప్లవ విజయ ధ్వజం రెపరెపై ఎర్రమేఘమై వంగి .. రేపటి

పోరాటాల పాటలలాగా గుండెల సండడి రేపి
కాలంవేసే తొలి ముందంజై భావిమీద కాల్జాపి .. రేపటి

అరణ్య గర్జన గ్రామం చెవిలో రహస్యాలలా ఊది
పర్వత గుహలో ఘోరాశని ధ్వని ప్రజలగుండె కందించి .. రేపటి ..

భూతకాల మృతదేహం ప్రస్తుతకాలం చితిపై పేర్చి
పరిణామాగ్ని జ్వాలను పోరాటాగ్నులతో మండించి .. రేపటి..

సికిందరాబాదు జైలు, 17–7–1971

# "స్వర్గపురి"

[వెంగలరావు భాగోత స్వగతం]

రాళ్ళు వేద్దామా, పునాది
రాళ్ళు వేద్దామా ?

రాళ్ళు వేద్దమ నయముగా సరి
కొత్త గొప్ప పరిశ్రమలకు ?

రండి దుర్ముఖ రక్షకులు మొత్తము
రక్తరంగము నమాయత్తము !

చెట్లులేనీ అడవిలో మరి
రాళ్ళులేనీ కొండలోనూ

మనుషులే మృగములై తిరిగే
తుప్పలోనూ తిప్పలోనూ ....రాళ్ళు....

ఇక్కడా అక్కడని భేదము
లెంచనీ నిష్పక్షపాతము

మొక్కబోనిది పారిశ్రామిక
విస్తరణ మా దొడ్డ లక్ష్యము ....రాళ్ళు....

**రాత్రికీ పగలనీ ఎంచక**
**గుట్టు రట్టవుతుందనీ జంకక**

హింస ముగ్గులు తీర్చి మానవ
మాంసఖండాల్ కూర్చి పేర్చగ
ప్రాణహారతులెత్తి దుష్టుల
కపాల తోరణాల్ కట్టగ ....రాళ్ళు .
తుపాకీ తూర్యారవమ్ములు
తూటానిప్పుల పూలమాలలు
బాణాస్త్రాసురుల పౌరుష
వధాకేళీ మందిరమ్మిది ... రాళ్ళు..
గుంటనక్కలు కొర్నె మెకములు
గద్దలా వెనుదిరిగి వెళ్ళే
శౌర్య ధైర్య ప్రదర్శనమ్మిది
ప్రాణు లెరుగని పుణ్యక్షేత్రము ....రాళ్ళు..
యమాధర్మని కొలువుకూటము
చం[illegible] ద్ర విహార వనమిది
భూమిపై అభినవ స్వర్గము
అవతరించే సన్మహూర్తము . .రాళ్ళు.
శక్తిరాజ్యముతోన నెత్తుటి
మడుగులో కట్టాలె దుర్గము
' స్వర్గపురి ' యను పేర నిర్మితి
కోసమే అస్థుల పునాది
ఇదె పునాది అదె సమాధి ... రాళ్ళు
సమాధులకే ఇది పునాది
హత్య కన్నను ఏ పరిశ్రమ
మీకు మిక్కిలి ప్రియంబైనది ? ....రాళ్ళు

ఎమర్జెన్సీ కాలం 4-6-1977

మాహోతు

# ఖరీదెంత, విలువెంత ?

నీ విలువేది విలువేది విలువేది
ఏది విలువ ప్రాణానికి
యాపిధాపుంలో పాసిజం రాజంలో

అగ్నికణం సైతం తృణమైన చెయ్యాదు
సింహానికి జంబుకాని కొరకే ఖరీద — . . ఏది

పీడించే వారి నీడ పంట పైరుకు చీడ
నేలమీద నిజవనీడ లేకుండా చెయ్యాలని,
జనం జయింపొంది, పిట్ట
ధనం జాలం మంది, పగ
మొగం తీరు మారాలని,
నగవు తీగ సాగాలని,
ఒక గుండెకు మరో గుండె నతికే ఉద్యమంలోన
ఒక చేతికి మరో చెయ్యి కలిసే పోరాటాన—
తప్పుకూడ ఒప్పయ్యే తలంపు తీవరింతల్లో
ముందు వెనక కిందుమీదు తెలియనట్టి పుంతల్లో
ముళ్లమీద ముప్పులపై తప్పులనే నిప్పుల నుడి
గుండాల్లో గండాల్లో నడిచి అసువులను విడిచే
ప్రజాయుద్ధ యువవీరుల వజ్రహృదయ దుర్గాలకు
ఆదర్శ ప్రేరిత సంకల్ప లోహ కుడ్యాలకు ....ఏదీ....

నూగీడు

దొరలూ దోపిడిదార్లూ బలిసే దుర్వ్యవస్థలో
ధూర్తులు భ్రష్టులు దుష్టులు గెలిచే అవ్యవస్థలో
చరిత్ర తాల్చిన గర్భం ఫలియించక ముందే - తమ
చేతి నిశిత శస్త్రికతో భావి శిశూదయమయితే—
పేదలు సాదలు చల్లగ బతికి సుఖాలందాలని
కలల వెంట పరుగెత్తిన మేలి మనస్సుల మగటిమి
కేమి విలువ ?

ఎమర్జన్సీ కాలం, 19-6-1977.

# గుండెల్నిండా వూపిరి పీల్చుకో

చిక్కటి పొదల బదులు ఒంటరి పూదీగెలే
రెమ్మపట్టు తప్పి దుమ్ములో దొర్లే పుష్పాలే–
సంఘమా, సంఘటనా ? ఏదీ లేదిప్పుడు
ఉన్నా, పేరుకే పై పైన
పట్టి కన్నీటి తుడుపుకోసమే వుంది
శక్తి కావలసిందల్లా దుర్బల వ్యక్తిత్వమయింది
సిద్ధాంతం మారు రాద్ధాంతం
వాదబలం స్థానే దిక్కుమాలిన యుక్తి
పేలికలకూ్కడా చీలికలు
ఛి ఛీ !

మరెందుకిక్కడ? పద. పోదాం, బయల్దేరు:
ఎక్కడికని అడక్కు, దేన్నీ ఎదురుజూడకు. నడు!
కాలిని కన్నూ కంటిని మెదడూ కదుపుతోంది
కరిమబ్బుల్నుంచి విచ్చుకత్తుల వాడి మెరుపులు
జ్వలించే ఆకాశశిఖరాల నెక్కాలి మనం
కాలం పొదుగునుంచి పిండుకుందాం సంతోషం
ఆత్మవిశ్వాసం సంకల్పబలం
జయం జూలు నొడిసిపట్టుకుని చరిత్ర పంచకళ్యాణిమూపుకి
ఎగ్గిరి గంతేసి కూచుని దౌడు తీయిద్దాం
నిర్ణయంనుంచి వుద్యమాన్నీ, పాటనుంచి పోరాటాన్నీ
రగిలిద్దాం రాజేద్దాం మండిద్దాం కలపడిద్దాం
శ్వాసనుంచి వేడినీ వాడినీ పుట్టిద్దాం
కలల పీఠికో, పల్లకాటికో కాదు
మనమిప్పుడు పోబోతున్నది

సూరీడు

అస్త్ర సన్యాసం చెయ్యబోం కర్మసన్యాసులం కాం
అపజయం అధఃపాతాళాన బలిచక్రవర్తులం కాబోం
వామనులమేమో ప్రస్తుతానికి, త్రివిక్రములమై తీరుతాం
జనం మనది జయమూ మనది
చరిత్ర ఎవ్వరికోసం ఆగని జీవనది !
ఈదుదాం, ఎదురీతైతేనేం ?
దాటుదాం, అద్దరి చేరుదాం.

మరో పొద్దు పొడిచేందుకు సిద్ధమవుతోందక్కడ
ప్రయత్నం మనది వీర్యవంత మవుతుంది
రాలిన ప్రతి రక్తం బొట్టునుంచీ
అరిభయంకరులు ఉగ్రంగా
ఉదగ్రంగా జనసేనగా రూపొందగల రక్కడ
పోదాం ముందుకే మీదికే పోదాం
కదులు, గుండెల్నిండా వూపిరి పీల్చుకో !

ప్రజాతంత్ర, 19-1-1978.

# కొత్త సూర్యుడు

జగిత్యాలమీద సిరిసిల్లమీద వేములవాడమీద
నిజ్జంగానే వెలుగుతున్నావట్రా సూర్యుడా నువ్వు ?
చీకటికి నేల నప్పగించి పట్టపగటినికూడా రాత్రిగా మార్చి
దొరల్తో దోస్తు గడుపుతున్నావు గాదుట్రా సూర్యుడా నువ్వు ?
చిన్నమెట్పల్లి గడీపై కిటికీలోంచి ఒక పిరికిపంద ఖామందు
దొరు తుపాకీనుంచి మిత్తవ - తూటాలు పేలడం చూస్లేదా ?
చూస్తూ పడివుంటమేగాక, నీ కిరణాల బంగ్రగబ్బల్లోని
బక్క రైతాంగం వెయ్యంతా కరిచి రణపుళ్లు జెయ్యలేదూ ?
'కర్మసాక్షి' వట్రా నువ్వు, కలిగినవాళ్ళ ఫర్మాజా' పోలీసు తేళ్లతోటి
కలగలిసి కండలూడబెరికి రగతం పిజూస్తున్నావు
ఛీ : నీ మొఖం చూపకు !

కళ్లుగంటున్నై పంటలకోసం బండరాయి పొలాలు గూడా
పోరంబోగునేల చేరబిలుస్తూంది నాగేటికర్రుల్ని
అరకల బుజాలమీదెక్కి ఎర్రజెండా ఊరేగుతున్నై వందలాదిగా
'జీనాహైతో మర్నా సీఖో' మంటున్నాయి మేల్కొన్న జీవాలు
భూమి పురిటినొప్పులు పడుతోంది, భవిష్యత్తు నెత్తురుగుడ్డవుతోంది, చూడరా !
సర్కారు మలామా, దొరలగులామా ! ఏలామంటున్నావట్రా ?
థూ ! నీ మొఖం మండ !

[illegible]

# బండి పాటలు

## (1)

అడవింకా విడవలేదు దగ్గరలే దేవూరూ
మనిషితోడు లేనేలేదు చీకటి ముట్టడి నెత్తదు
ఎట్టబ్బా, ఎట్టబ్బా!
ఎట్టా గిక్కట్లు దాటె దెట్టబ్బా, ఎట్టబ్బా!

చక్రం వొదులై పాయే కడసీలలు వూడిపాయె
పట్టాలైనా నిలవ్వు నొగల్లోన నాధుడేడి?
ఎట్టబ్బా, ఎట్టబ్బా,
పాటుబడక పాటునబడె దెట్టబ్బా! ఎట్టబ్బా?

గతుకుమీద గతుకుకుదుపు నడకలే దికేటి ఏపుగు
ఎలపటెద్దు ఎలపటికీ దాపటెద్దు దాపటికీ
ఎట్టబ్బా, ఎట్టబ్బా,
ఏడీ సరిజోడీ, ఎట్టబ్బా, ఎట్టబ్బా!

ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక, 1-12-1978.

## (2)

యేటి కొకటీ కోటి కొకటీ లాక్కుండా
యెలపటి గిత్తనీ దాపటి కుర్రనీ జోడించి
చదరమైన బాట బట్టి పోనిస్తూ
గతుకులు తప్పించి బండి తోలుతూ
నొగలెక్కి నిబ్బరంగా కూచున్న పెద్దమనిషి
లేనంత మాత్రాన, ఆగుద్దా ప్రయాణం?

తలమనిషి లేడనుకో సిద్ధగాళ్ళు లేరా?
నడిపెటోడు లేకుంటే నెట్టెటోళ్ళు లేరా?
బండీ వుంది, బండెడ్లూ వున్నై
పక్కల పనిగాళ్ళూ ముందెనకలమందీ లేరా?
బరువు తెలుసు బాధ్యతా తెలుసు
ప్రయాణం ఎందుకాగుద్దిరా
పంచాంగం లేనంత మాత్రాన చుక్కల కేమిట్రా?

"సృజన"

'68

# ఎరుపు రేక

మహాసముద్రం పిల్ల పయ్యరా
తిరుమల తిరుపతి వేడి తెమ్మెరా
బెంగుళూరు చలిపిడుగు బంతిరా
మదరాసున చిచ్చర పిడుగేరా—
          తమ్ముడా నర్సింహారెడ్డి
          తెలిసి తెలియకుండనె పొయ్యావా!

రివటలాంటి వొంటి సొంపూ
జాటీలాంటి కండపూపూ
గాలివాలూ నీటిజాలూ
ఎట్లా కలగలిశాయో నీలో ...తమ్ముడా..

పూతరా పసరు పిందెరా
చిగురురా చిరుతమువ్వరా
మలిసంజె అపరంజి రేకరా
రేయెండ పొడల నునువాకరా ... తమ్ముడా ...

బెంగుళూరులో మునిగిందెపుడో
మదరాసున మరి తేలింపుదెపుడో
మహాదేవుతో నల్లగొండలో
కటిక రాతిపై పడుకొందెపుడో! . .తమ్ముడా...

సడిజెయ్యని సుడిగాడుపు ముట్టడి
రక్తం మరిగిన రాక్షసికి పట్టుబడి—
అకస్మాత్తు దిగి దూకిన డేగా
గోటగుచ్చి ఎగరేసుకు పోగా ....తమ్ముడా....

సూరీడు

ముబ్బు చెరగునా మెరుగువికావా
గబ్బిగీపులో మిణాగురుకావా
చలిలోనైనా వెచ్చనకావా
పాపకైన చిఱునవ్వు నివ్వవా ?
నూగే వదలని పెసరకాయురా
పసరం కసకస నమిలివేసెరా
పిల్ల తెమ్మెరే వడగాడుపులకు
తల్లడిల్లి సొపిల్లి పోయెరా ...తమ్ముడా...

ప్రజలు ప్రవాహం నువ్వొక అలవే
ప్రజాఉద్యమంలో గలగలవే
గెలుపు వైపుకే ఎరుపు వైపుకే
సిలుపులేని తొందర కదలికవే
తమ్ముడా ! నర్సింహారెడ్డీ !
విప్లవ దీపి నేత్రాలు నీవేరా !

మే, 1979

# వానపులి

ఆకాశం కారుమబ్బుల చిట్టడివి
ఉత్తరం చిక్కటి పొదరిల్లు
పశ్చిమం గాడ్పుతేళ్ళ పిదిలిన పుట్ట
వాతావరణం భీకర ప్రకంపనం :
జనపదం మీద మృత్యుపాద ఘట్టనం
సాకారంమీద ఘోరవికారం విహసనం
నిర్మాణంమీద శైథిల్యంచేసే ప్రతిజ్ఞ
మనిషిమీద వన్యమృగ బలప్రదర్శన

ఈలగా మొదలై ఊళగా మారి
రాకాసి గగ్గోలు ఘోష గాలి మహమ్మారి
తిప్పించి మళ్ళించి ఎత్తి నేలమొత్తే విధ్వంసకారి
పిల్లల ఏడుపుల్లా పిల్లుల అరుపుల్లా
బైటినుంచి చెవుల్లోకి దూసుకొచ్చే హోరు
పట్టపగలే వెలవెలబోయేలా వెండి మెరుపు జోరు
తీరం దాటుతూన్న అకాలం తుఫాను
అకటా వికటల ఢిల్లీ తుగ్లక్ సుల్తాను.

గుంజిళ్ళుదీస్తూ లేత పెరటి మొక్కలు
రాలి నేలకంటుకుపోతున్న పూలరెక్కలు
తెగి తునిగి గుట్టపడుతున్న వృద్ధవృక్ష అవయవాలు
ఎక్కడి కక్కడే కూలి లేవలేని గుడిసెల జీవాలు
నేలతల్లి వలువలు వదులై వూడి ఎగిరిపోతూ
నాగరికతకు దారుణమైన మానభంగం
విలువలూ ఖరీదులూపడి తేలికపడి
పిచ్చి దయ్యానికి శ్రమ, సృజన మొక్కుబడి

బెబ్బులి పంజావేటకి తూలిపడింది దృశ్యం:
వాననీరు చలిస్తే గాలి కసిరి కరిస్తే
కాలం నాడి తీవ్రించి గుండె సందడిస్తే
గాతబట్టిన కోరపళ్ళ నోటితో గబ్బురేపితే
ఆటవిక ప్రకృతి వికట అట్టహాసం చేస్తే
గాలిజానా పెనబడి వినాశనపాశం విసిరితే
చూసేదేమిటి ఈ మాపు ముప్పుదాటి రేపు
సాదా అందచందాల మానవలోకం రూపు?

12_5_1979

# చిన్నాలూ

విన్నా నెన్నో కథలూ గాథలు
చిన్నాలూ, జన్ను చిన్నాలూ!
ఏ వొకటీ నన్నిలా చెయ్యలే
దిన్నాళ్ళా ఇన్నిన్నేళ్ళా!

కబుర్లు కతలూ గుబుర్ల బొదలై
చిన్నాలూ, జన్ను చిన్నాలూ,
సిన్నో ఎఱ్ఱటి గన్నేరు పువ్వగ
నిలిపినాయి నా వూహల్లో ॥చిన్నాలూ॥

ప్రతి ఒక కబురూ పగడపు చిగురై
ప్రతి ఒక పూనిక వజ్రం తునకై
జనంలోన వేరూనిన చెట్టువి
మాయని పచ్చనలోపలి గుట్టువి! ॥చిన్నాలూ!

రక్తంలో తేలాడే రాజ్యం శవంమీద కూర్చున్న ప్రభుత్వం
కుబేర రక్షాకవచం రాజ్యాంగం కపాలకుంతల ఈ దుష్టత్వాల
గొడ్డటివేటుకో కత్తిపోటుకో
పడి చనిపోతావనుకున్నామా,
విప్లవ నినాద మిచ్చే గొంతుక
రెండుగ తెగుతుందనుకున్నామా! ॥చిన్నాలూ!

[illegible]

అనుకున్నామో అనుకోలేదో, కలగన్నామో కలవరపడ్డామో,
గతజల సేతు బంధన మెందుకు? మృత సంజీవని మంత్రాలెందుకు?
బతికిన రోజులు బాణాసంచా
పిడికిటిపట్టే చేతిబాంబుగా
పోరాటం జనకోలాహలమై
ఊహాల సువ్వాక దీపావళే॥ ॥చిన్నాలూ॥

ఏడవనీ ఏడ్చేటి వాళ్ళను: వానచుక్కలవుతునై నా కళ్ళు
అశ్రుధారా కొక్కటి అంటిపాలమై స్వత్వం మెరుపుల మయమౌతున్నది
గాయాల్లోనూ గాండ్రింపుల
కంఠ స్వరాలక ప్రస్తుతులు ॥చిన్నాలూ॥
విందులు కుడిచే వాళ్ళ కుటుంబపు
పుట్టేటోళ్ళని తప్పుబట్టుసి
చివరికి మిగిలేది జనాలె
చిర్నవ్వులు చిందే చిన్నాలే॥ ॥చిన్నాలూ॥

ఎలా నిలవమో ఎలా గెలవమో
నేల తల్లి చెరనెలా కూల్చామో
అది సొంతం చూశాకే, లెక్కల
అజాపజలు అప్పుడే తెలుద్దాం॥ ॥చిన్నాలూ॥

తే॥ రా॥ మాలోన కలిసిపో! గుండె ధైర్యమై ముందుకె నడిపెయ్!
వడిశల విసురై కొడవలి జపురై నానా సమ్మెట మేడీ కర్రువై!
పైడిపల్లెలో పైడికంటివై
పాడని నీ మాట మాపాటకే బాట॥ ॥ చిన్నాలూ॥

27—10—1979

మావోడు

# పౌర్ణమి వైపుగా

పడమటి మబ్బు మసకల్లో
పోరు—గాలికి గూడా చలించక
పడివుంది పంచమి చంద్రవంక
మూర్ఛలో

కొమ్మల్ని కలుపుతూంది
పూర్ణత్వం సూచించే అస్పష్టరేఖ

ఇంకా పది రాత్రుల తర్వాతే పౌర్ణమి
అందాకా అవసరం కంటికి ఓరిమి.
ఎదురుజూస్తూ కూచోడం కాదు
ఎదురు నడుస్తూ పోవడమే
కర్తవ్యం

సూచ్యం వాచ్యమయేంతదాకా
వ్యంజన వాస్తవంగా మారేదాకా
రేఖ బింబమయేలా క్రమంగా
రాకా చంద్రుడు ఉదయించేంతదాకా
ఎదురోట్టాలు.

"ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక" 21-12-1979

# దొరపోతు

లేపాక్షి బసవయ్య లేచివచ్చిందా? రాతినందికి లేని రంకెపెట్టిందా?
అవినీతే గొప్ప ఉపోతయ్యెను గాని, మనిషికంటే దొడ్డ శ్రీమంతు దొరవారె!
పుష్టిగా దిట్టగా బసుల పెరుగదాంగా, గుండులా నిండుగా మందసర్దారుగా
అయ్యా లాయ్యా లానపిక లాసదర అన్నిగూడా దొరల అప్పులకు మచ్చులే.

మూపున్నగల చెండు మింపనే మాడాలి, గంగడోలె నేలవంగగా చూడాలి
మిన్నుమన్నులు పట్టుకున్న నిక్కుడు వట్టి, మన్నుమిన్నులు
దిసాయించనట్టి తుళ్లు!
నిలబడిన లావెల్ల బలమైన 'గడి'యానెను, ఒరుకున్న చోటెల్ల 'బంకుల'నిపించేను
ఎంత తిరిగిన అంత సొంత జాగిచేను, ఏవ్వశించిన పొలము
'బంచరాయ'య్యేను

దొరపోతే రివిగా దర్జాగ నడయంగ, బక్క జీవాలన్ని పక్కకే తొలగాలి
బీళ్లు తోటలు పంటపొలములో అడ్డేది? తొక్కినా మెక్కినా దండించు దుడ్డేది?
చట్టమంటే సొంత యిష్టమేనన్నట్టు, పెద్దరిక మంటేను గెద్దరిక మన్నట్టు
కొమ్ముతో కుమ్మేను కాలితో మట్టేను, కండకావర మెక్కి దుండగం సలిపేను,

మోసింది మూల్గింది కుమిలింది ఏడ్చింది, ఓర్చింది ఘోరాలు కార్చింది కన్నీళ్లు
చిట్టచివరకు ఒక్కపెట్టున్న లేచింది, భూమిదేవర గుండె భగభగా మండింది:
నీరుగారిన కళ్ళ మెరుపుకే మెరవంగ, దండమెట్టిన చెయ్యి దండమే యెత్తంగ
గుండెధైర్యము ఎర్రజెండగా యెగరంగ, భూమి బిడ్డలు 'సంగ'బలము
గుర్తించిన్రు.

నేల మేలుకొనింది గాలిపుడ కెత్తింది, "బాన్చలం" అన్నోళ్ళ మనుషులై
నిలిచిన్రు
'బంచరాయీ' భూమి వంచిన తలెత్తింది, అరకలన్నిదపిన ఎర్రజెండాలాయె!
కట్నాలు దండుగలు కానికలు మరిబందు, 'హక్రాజు'లే బందు హజములే
ఇక బందు
హక్రోజు దొరలకిక అగ్గిసిప్లా బందు వెట్టివాకిరి బందు వృత్తి సేవలు బందు.

'గడి' అడిలిపోయింది 'గడి' ఖాళీఅయ్యింది, లంకంత లోగిలె రోసువైపోయింది
మొక్కులందిన 'బంకు' దిక్కులేకున్నది, మీసాల పైకొనే పెందుమీసైనది!
ఎర్రిగొల్లలు యేరీ? గొర్రెలుగొడ్లికనెట్ల? మడ్డిగౌడులు యేరీ? తాడి కల్లికనెట్ల?
సేతుసిందీ లేరి? రైతుహాలీలేరీ? చాకళ్ళు మంగళ్ళు నౌకర్లు యేరేరి?

పల్లెకాదిది పక్కలోపటి బల్లెమే. పూరుకాదిది మీదికురికేటి గండమే
బతికివుండాలంటె బలుసాకె మిగిలింది, పదిలమువ్వాలంటే పట్నమేదారికింది

పిరికి పశువుల మందపాటవం చూపంగ, లేపాక్షి బసవడికి తాపమే హెచ్చింది
గురగురలు తప్పితే కొరురంకే రాదు, పోతుకళ తప్పంగ ప్రేతకళ వచ్చింది!
"దణ్ణాలు బాన్చలం! దొరకాలు మొక్కుతం!" అని మనివిజెయ్యవేయాపులూ
లేగలూ
దారిపొలగపు బక్కెద్దులూ గేదెలూ, దండగట వెర్లింప వేసన్న జీవాలు.

ఆనవాయితి మేర ఆగిపోయిందిపుడు. చేను కర్రెత్తింది చెలక అదిరించింది
'బంచరాయీ'బీడు కంచుగొత్తెత్తింది, 'పారంపోగూ' పొలం పురిమి
తరిమేసింది!
పేర్పుగట్టిన కొవ్వు కరిగిపోసాగింది, కండకావరమంత యెండిపోసాగింది
బిర్రబిగిసిన వొళ్ళు బీదబడసాగింది. కళ్ళకెక్కిన పొగురు కారి కన్నీరైంది.

నిలబడ్డ తాపెల్ల ఓలపోరె తోచంగ, కూలబడితే వొళ్ళు సోలంగ తూలంగ
తిరిగెటందుకు కాళ్ళు గుదిబండలనిపించ, నీడనివ్వని చెట్టు నిప్పులే గురిపించ.
ఏనుగే పీనుగై నందియే పందియై, చిక్కి సగమయ్యింది చొంగలే కార్చింది
గడి'కూడ పల్లకాడుగ రూపుమాసింది, 'బంకు' శంకూదంగ భూమిగావడిగింది.

[కరీంనగర్ రైతాంగ పోరాటాల గాధ ఆధారంగా]

'జయశ్రీ', 1980 సంక్రాంతి సంచిక

సూరీడు

# తొలకరింపు దగ్గరబడింది

శక్తిగా ప్రగల్భిస్తూంది పశ్చిమం
తల విరఁబోసుకు
గాలిగోలతో ధూళికేళితో
దెయ్యమై
మార్పుమీదికి ఒంటికాల్తో లేస్తోంది
కయ్యానికి !
షాపం !

నోరు పడిపోయినట్టు నీరసించి తూర్పు
దూక్ష తగిలినట్టుగా దక్షిణం
ఉత్తరం ఎప్పుడూ వుత్తుత్తే—
మూడు దిక్కుల గాలీ తీసి
చిగుళ్లూ మొగ్గలూ పిందెలూ ధూసి
పొగరెక్కి ఆంకరిస్తూంది పడమర

ఉండనీ యింటి బయట గోలెడుతూ
రానీకు లోనికి పీథనబోయే శనిని
మూసుకో కిటికీ !

సూరీడు

దూరిందో,
మరి నీ గదీ, నెమ్మది నీవికాదు
వృక్ష్యపోనైనా నయమే
ఇది జలస్పర్శలేని గాలి యవాసు
పిచ్చెత్తినట్టు తిరిగే రాకాసి 'వాన'.

గగనం కడు భయాంది
రాలకటంపు తయారికే
ఈ తిప్పలన్నీ

ఆంధ్ర జ్యోతి సచిత్ర వార పత్రిక, 18-1-1980.

మావోడు

# నిశ్చల దృశ్యం

కాలం కుళ్ళబారిన శవం
గొడ్డటికైనా పగలని స్తంభం గాలి
చితిమంటల పొగ గగనంలో మసక
చుక్కలు చెల్లాచెదరయిన నిప్పురవ్వలు
వరదు రొయ్య వక్కి చంద్రుడు
కరడు గట్టిన నీరసం వాతావరణం
ఊపిరి పీల్చే 'నరహనవ' శ్మశానం- లోకం!

కాలం కదలదు తోలదు గాలి
మబ్బు చినకదు వెలగదు చుక్క
ఉలకడూ పలకడూ చంద్రుడు
వాతావరణంలో కంపనమే లేదు
ఊపిరే తీయదు ఈడిగిలబడిన లోకం!

'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రిక; 29-2-1980

# చమత్కారికి

ఎగా దిగా చూస్తే
నీకు నువ్వైనా కంటికానవ్
నిదానించి చూడు :

నువ్వూ
నీలో యితరులూ
కుటుంబం
వర్గం
సంఘం
లోకం !

తల్లక్రిందుల తపస్సు చేస్తానంటావు
వాలఖిల్యుడివా తండ్రీ నువ్వు ?

ముందు కాలూని నుంచో
పల్టీలూ
బొమ్మలాటలూ
సర్కస్ ఫీట్లూ
ఆ తర్వాత—

నువ్వొప్పుకోవులే నాకు తెలుసు
నీ తత్వం పులిపికట్టెత్వం

మాఘోమ

నీ దారి నీది
అది అనంతం
దానికి నిర్లక్ష్యమే లక్ష్యం
సర్వ విధ్వంసనమే కామ్యం

అందువల్లనే కాబోలు నిన్ను గొప్పోడి కింద కట్టారు
వాళ్ళెరగరు నువ్వొట్టి అల్లాటప్పా రావువని

నీకు వేసే ప్రతీ పొగడ్తల దండా
శ్రీనాధుడికి వేసిన పొగడదండే
నీకు సత్కారం జనానికి అపచారమే
అది నీకెలా ఎరిక ?
ఎరికైనా నీకేఁటి ఖాతరు ?
నువ్వు నువ్వే
చచ్చినా మారవు
అయినా మార్పు నా వోర్పంటావు
నేర్పు నా మార్పు అంటావు
నువ్వు కళావంతుడివి, నిజం !

ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక, 29—5—80.

# వాడు చచ్చాక

వాడు విసిరిన బాంబులు
కట్టడాలను పైకి లేపినట్లు
తేలింది

వాడు చల్లిన యాసిడ్
గుడ్డివాళ్ళ కళ్ళను బాధాకరంగా తెరిపించినట్లు
తెలిసింది

వాడు ఖరాబు చేసిన నీటినుంచి
బహుమతి గెల్చుకునే చేపల్ని
జాలరోళ్ళు పైటకు లాగారు.

వాడు నాటిన విషప్పులుపుల
నీడ చలవ ననుభవిస్తూ
అబ్బురపాటుతో కూర్చుండిపోయాం.

వాడి వర్ధంతి రోజున
రెండు నిమిషాలపాటు
రక్కసి నిశ్శబ్దం పాటించాలంటూ
ఆజ్ఞాపించింది ప్రభుత్వం

మూలం . నార్మన్ మెక్కేగ్
1980 — 81

# "మోసం గురో!"

ఓట్ల బంధువులు వాక్దాన సింధువులు
సత్కార్య వర్షా బిందువులు రాచబందుగులు
వస్తూ పోతున్నారు వగలు మాపులున్నారు
ఒలికిస్తున్నారు జాలి  మిగిలిస్తున్నారు జోలి

ఎంత సానుభూతి! ఎంత మంత్ర విభూతి!
ఏమి దయా యంత్రం! ఎంతటి విచిత్ర తంత్రం!

శవపంచాయతీదార్లు మాయదార్లు
మెంబర్‌షిప్ హక్కుదార్లు చెక్కుబొక్కు సొంతదార్లు
సర్పంచీలు సవితల్లి సమితి పెసరంట్లు
మురికిపాలిటీల ఛోర్మన్లు జోర్మన్లు
కరప్షరేషన్ రేషన్ మోయిందార్లు
ప్రజాదాసుల పై పేషగాళ్లు దొంగదాసర్లు
పంచాయతీ శవ-రాజ్య భోజనశాల మేస్త్రీలు
రాజ్యపూజితులు జనజీవన వ్రణాలమీది పెశాస్త్రీలు—

స్వాగతం, సుస్వాగతం! శుభ ప్రభాతం! దయచెయ్యండి!
అక్కరదీరింది కదా, మరి దయదలవకండి!
బోడిమల్లయ్యలమయ్యాం ఓడమల్లయ్యలమైన మేము
మోసపోవడమే మా జన్మహక్కు! మీ పల్లకీ బోయీలము
దాసానదాసులము, మీకందరికీ వందనము, సలాము!
గులాములము, మీ మహానీతి వ్రతానికి మాదే షలాము!

'జమీన్‌రైతు' 28-8-1981

# చూడు రేపటిలోకి

ప్రవాహగతి స్వరూపం మారుతుందని
ప్రధాన 'స్రవంతి' సస్రంతి ఉప్పులుండని
తెలుసా ?
అక్కడ మందు మొంటు మొక్కయినా పుట్టదు
నలుసులు నలుసులుగా యిసక మేటలే మిగిలేవి .
పాయగా పొరగా పాయిఉన్నాయి సీక్షనా
సీ ప్రవాహం ?
పాచిబట్టి చెలమ లెప్పుడున్నాయినా ?
పూటికి శానా ఎడంగా
పూరికి శానా దగ్గరగా
పడుతోంది భవిష్యన్మహాప్రవాహిని .
సూచనగానే కాదు
సూది పొడిచినట్టుగానూ కాదు
బలపడుతోంది భీకరాకారం ధరిస్తోంది
కనుమూసుంటే చూడు - లేదూ,
నట్టేట్లో బుడుంగు బుడుంగున జలకాలాడు .
ఏటి కెదురీదదమా ? సీ రాతర్దిగి రావాలి !
నొష్టి వ్రాలు న్నమ్ముకుని
దృష్టికి సృష్టి కలిగించుకుని
నువు దెష్టవౌతున్నావు - ద్రష్ట ననుకుంటూ
ప్రవక్త వేషం కడుతున్నావు ప్రవచనాలు నోటబెట్టుతూ
'దద్దమ్మ' కు నీ ప్రతి చేష్టా నిదర్శనమే
దగాకి నీ ప్రతిమాటా తార్కాణమే

ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక, 11-12-1981

మావోడు

86

# కథా నాయకుడు కావాలా ?

" వీరు లవతరిస్తేనే గానీ విముక్తి లేనేలేదనుకుని
బతికే జాతికి చివరకు మిగిలేది కేవలం దుర్గతి "
అన్నాడట కవి బెర్టోల్ట్ బ్రెష్ట్
ఆ మాట సెంట్‌పర్సెంట్ కరెక్ట్ '

కావాల్సింది వీరులు కాదబ్బాయ్, కార్యశూరులైన సామాన్యులే భాయ్ !
హక్కుల్ని నూరిన కత్తులుగా మారిస్తే మొక్కల్ని నెత్తురు నీరోసి పెంచితే
జీవితాని కంతటికీ చల్లటి నీడ అవసరమేలేని పోరాటాల క్రీడ

ఏరు దాటాక తెప్ప తగలేసే వీరుడు అవకాశవాద రాకాసే
కాబోడని, పూజలందుకోడని, వరపడమనడని,
కాడిని అర్రున మోసే సాదా మనిషిని రాచి రంపాన బెట్టక
దిగిరాని ఏల్నాటిశనిలా 'చిరంజీవ ! దీర్ఘాయుష్మాన్భవ ! '
అనుకోడని ఎలా నమ్మమంటావు ?

జనం తనతనాన్ని వదలుకోక జుత్తు మరో చేతికి దొరకనీక
తన కథలో తానే నాయకస్థానాన నిలిస్తే
తన కష్టసుఖాలకు తానే బాధ్యత వహిస్తే
వీరులెందుకూ పీరులెందుకూ తనకు ?
కార్యం తనది తానే చక్కదిద్దుకోవాలి చివరకు.

1982.

# సంకల్పం పోరాటం

మరిపించేటోడేడీ ? బండబారినై కత్తులు
చొరవ జూపెటోడేడీ ? మొద్దుబారినై శక్తులు
నడిపించేటోడేడీ ? మసక బారినై చూపులు
ఒడ్డు జేర్చేటోడేడీ ? తోస్తున్నై అలతాపులు. . .
పైనెవడో లేడు ప్రభుడు పైననుంచి దిగిరాడు
పనిమ పడమనేది లేదు కొండెతోటి కైలాసం !

పరమపదకు శరణమునకు వ్రతం వృధా క్రతువు వృధా
మొక్కకు పాదాలబడకు యాత్ర వృధా నిష్ఠ వృధా
పక్కనుంది మందితోడు ముందున సిద్ధాంత కాంతి
పడిలేచే కడలితరగ ఉద్యమ పోరాట క్రమం. .
నింపో అడుగెయ్ నడిచెయ్ చెయ్యి చెయ్యి గట్టిగోడ
తలపడి కలబడి గెలిచెయ్ హాలం పొలం ఇలాతలం !

కదిపి కలిపితే విజయం ఉద్యమించితే ప్రళయం
రాజేస్తేనే మంటలు మోగిస్తే జయఘంటలు
ముందు మిగిలినోళ్ళ్ని కలుప్ కష్టాల్నెదిరించి నిలుప్
చిచ్చుల పుచ్చుల్ని చీల్చు చచ్చూ పుచ్చూ విదుల్చు....
కరనెక్కిన ఆయుధాలు పదనెక్కిన ఆశయాలు
మిన్నెగిసేటి పతాకలు మిసిమెక్కే భావాలు !

మావోడు

పార్టీ నీ జయసారధి పార్టీయే నీ వారధి
పార్టీ నీ మొనగాడు పార్టీయే జతగాడు
అవతారం దిగిరాదు అనాథనాథుడు లేడు
లే డెవ్వడు దయామయుడు దీనబంధువే లేడు .
కోటి కోటి ప్రజాధాటి సంకల్పమె గెలుపు పిలు
బిందువు బిందువు సింధువు విప్లవమే జనబంధువు '

అగ్నిపూలు '. ఫిబ్రవరి, 1982,

# ద్వేషగీతం

పరగడపు దిగని పాచి నోళ్ళతో జిడ్డు వదలని మాడు మొగాలతో,
అర కడుపు అగ్గి గుండాల్లో పడి మాడే నులి పేగుల నాగాలతో,
మురికిజేరిన మొరటు వేళ్ళ మొటిక గోళ్ళతో, గార పళ్ళతో,
అనేకంగా అసంఖ్యాకంగా పేర్చుకున్న చింపిరి తల్లతో, దిస మొలల్తో,
ఆస్తిపరులు అదిరదిరి పడేలా అధికారం నెర్ర రిచ్చేలా-
వెండి మిన్నుల్లోకి వెనవేల నల్లజడల తుఫాను మబ్బులా
ఎండిన యిసుక మీదికి ఎన్నెన్నో పాయలతోటి ఎర్రటి వరద వుబ్బులా
చిగురైనా అల్లల్లాడని ప్రస్మ్రదం పైకి దండెత్తే పడమటి గాడుపులా
    జీవసమాధి పాలైన నిజ జీవితం నిర్జీవనం లోంచి
    అక్షయ జనపర్వాలతో
    కక్షను ముందెట్టుకు—వస్తూంది
    సహస్ర ముఖాలుగా
    సునిశిత నఖాలతో
    పచ్చి పడక తప్పదు—ద్వేషం!

కుళ్ళుబోతనం కాదు చూళ్ళేనితనమూ కాదు అసూయాగ్రస్తం కా
కుత్సిత బుద్ధో కుట్ర పద్ధతో 'కుంభకోణమో' కానేకాదు
    పట్టపగటి పూట. నట్ట నడిజామున
    నిబ్బరంగా నిర్భయంగా
    కాళ్ళు వంచక వుద్యమంగా
కురిసే మిన్నున మెరిసే నిడుపాటి పటాకత్తి చూపుల్తో
మరుపురాని అగణ్య అన్యాయాల జ్ఞాపకాల పేర్పుల్తో
పచ్చిపుండైన గుండెనిండా గాఢక్రోధం కుక్కుకుని
పగను వెంటబెట్టుకుని ముఖం చెండుకుని-

మావోడు

ఒళ్ళే ఆయుధాగారంగా
ఊర్పే ఆగ్నేయాస్త్రంగా
నడిచే జడల మర్రిగా
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో—అదో
వచ్చిపడితీరుతుంది—ద్వేషం!

వీరభద్రుడై దక్షాధ్వర విధ్వంసం సల్పడమే కాదు
గరుత్మంతుడై కాద్రవేయుల్ని పొడిచి గుచ్చి భక్షించడమే కాదు
గణాచారిలా శివమెత్తి వున్మత్తనృత్యం చెయ్యడమూ కాదు.
బొట్టు బొట్టుగా రాలే విలువైన చెమటలో నుంచి
మట్టిపాలౌతున్న కాయకష్టం శక్తినష్టంలోంచి
బూడిదలో పోసిన కావిరికళ్ళ కన్నీళ్ళనుంచి
వాడి వత్తలైన ప్రాయమూ పరువమూ నుంచి
పుసీ చీమిడీ కలగలిసిన తీరని గోడునుంచి
తమ శ్రమే తమకు శత్రువైన బతుకు బీడునుంచి
దయామయమైన దగానుంచి నగిషీ దోపిడినుంచి
కొలిమి తిత్తులైన వూపిరితిత్తులనుంచి
ఎండిన యెదుర్రొమ్ముకనుంచి
పనిముట్లయిన చేతి రెట్టలనుంచి
బతుకుదెరువైన బండచాకిరినుంచి—
కలదెలుసుకుని లేచినట్టుగా
కూడబల్కుకుని ఏకకట్టుగా
నీటితో కాలుస్తూ
గాలితో వేలుస్తూ
చూపుతో కాటేస్తూ
స్పర్శతో మసిచేస్తూ
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో— వచ్చేస్తూంది ద్వేషం!

సూరీడు

పాములా పసిరికకళ్లతోకాదు, పులిలా మంటకళ్లతోకాదు,
గూబలా తొలిచే కళ్ళతోకాదు, గెద్దలా గుచ్చే కళ్ళతోకాదు,
రెమ్మలుతుంచీ కొమ్మలు చెరిగీ లాభంలేదని
ముట్టి చెట్టుని మొదలంటా నరికి సమూలంగా పెరికి
తక్షకుడితోబాటు ఇంద్రుడికి సైతం హోమాగ్నిలో 'స్వాహా' పలికి
వెడలని నిట్టూర్పుల పెరిగే వెనుబలంపుతో
విడవని కన్నీళ్ళనులిపే పురవడి పంపుతో
కాలాన్ని కదిలిస్తూ
చరిత్ర వంకర దిద్దుతూ
నేలను చదునుచేస్తూ
[illegible]గా
[illegible]గా
సహస్ర ముఖాలుగా
[illegible] నఖాలతో
[illegible]నే పుట్టించదో ద్వేషం!

పోటెత్తిన కారునలుపు కడలి తరగమీది నురుగుతెట్టెలా
పారసీ కెరలీ కోసుకుసీ దూసుకుసీ వడిగా చిత్తడిగా
ధైర్యాన్ని ముందుంచుకుని, నిశ్చయాన్ని పక్కనుంచుకుని
అనేక శ్రేణుల ఏకైక పర్వతంలా నిక్కుతూ తొక్కుతూ
పరిణామ మహాశక్తిగా విక్రమించి విప్లవించి
సాధ్యాసాధ్యాలనూ బలాబలాలను సమీక్షించి
మతి మంతునిలా వ్యూహం రచించి
యుక్తిశాలిలా యెత్తుగడల నూహించి

ప్రతిముందడుగూ ప్రజారాశి పై అడుగుగా నిరూపించి
సుడిగుండంగా
యమగండంగా
సుశిక్షిత విజిగీషులై
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
ఇదో వచ్చిపడుతూంది ద్వేషం!

మబ్బుకింద కురిసే మరో మబ్బుగా నిండిన వర్షాకాశంలా
తరగవెంట ఎగిసే మరో తరగగా పడగెత్తిన ప్రళయార్ణవంలా
పోరుపిమ్మట తీవ్రించే మరోపోరు సాగుతూన్న నిరంతర రణరంగంగా
విషలిప్తంగాని ఆయుధాలను ప్రయోగిస్తూ
విపరీతంగాని స్థిమితబుద్ధితో యోజిస్తూ
దయకు యోగ్యత కోల్పోయిన దురవస్థపై పగబట్టి
దోచుకు బతికే దుర్నీతి కంఠానికి పుక్కు పురిచుట్టి
ధర్మంతానై న్యాయంతానై
మానవ మహనీయత మేనై
తెలివితో తేకువతో
చురుగ్గా కరుగ్గా
సహస్ర ముఖాలుగా
సునిశిత నఖాలతో
అదె! వచ్చేసిందిదే ద్వేషం!

"భారతి" 1982 ఫిబ్రవరి

కూలీడు

# గుట్టుకి సంకేతం

ఊహాలో పరవశించేందుకే, పలవరింతకేగాని
గోటితో గిల్లి కసుక్కిగా పూబూచేటందుకుగాదు
ఆకాశ కుసుమాలు.
దేవతా చెట్టుకి పూలంతోటి పనేమిటి ?
మట్టిలో పుట్టి పెరిగే మొక్కలను కాలిపట్టు
చిక్కుడు పేల్ల చిక్కిరిబిక్కిరి అల్లికే.
పచ్చటి చలివేంద్ర
గాలినీ వాననీ మంచునీ ఎండనీ తట్టుకుని
కొమ్మలతో సాముజేసి నిండిన పూపిరితిత్తులతో
లక్ష నాలుకలు కదిలించి మాట్లాడుతుంది గలగలా.
తనలో తను మణిగి తనతోనే పెనుగుతూ
లోకంతో కలబడి నిరంతరంగా సాగిస్తుంది,
బహిరంతర పోరాటం.
వట్టి పనుగడ కాదు తనది. విత్తనంలోని బద్దల వైరుధ్యాలు
పరిష్కరించుకుని పిలక రిక్కించి మొలకై
రూపాంతరం పొంది మానై
పరిణామానికి సాక్షిగానే నిలవక ఫలితమవుతుంది
లేనిదెక్కడ ? ఎన్నెన్ని వంగడాలకు తల్లి కాలేదు ?
అనంతమైన వంశవృక్షం నాచునుంచి పాచినుంచి మొదలై
నరుడి దాకా విస్తరించింది—
వనస్పతి మహాప్రజావతి జగద్ధాత్రి సూక్ష్మకృతి—
దెయ్యానికి మారుపేరైన గాలికాదు తనది. మరి,
శిశు కోమల శ్వాస లలిత సమాశ్లేష స్పర్శ బాస

ప్రణయ రహస్యం
ప్రభంజన ఘోష
పిల్లలపిల్లి కీచు
కోయిల కిచకిచ
పిట్టల కిలకిల !
పసుపూ కుంకుం పెట్టించుకునేదీ, ప్రదక్షిణాలు
చేయించుకునేదీ, పాలుపోయించుకునేదీ, పూజలు
అందుకునేదీ, చెట్టుకాదు,
చెట్టుగురించి
అల్పమతుల క్షుద్రభావం
అది శక్తికూడా కాదు, భక్తి
పేరుతో ప్రతిఫలం కోరేయుక్తి
పిందెలు పండబారేదాకా పిల్లలకోడిలా కాపాడుతుంటుంది
వెయ్యి కళ్ల చెట్టు.
గిల్లని పూలు తురుముకుంటుంది తల
కొప్పున. చుట్టుకుంటుంది సరాలు మణికట్ల చుట్టూ. గుచ్చని
దండలు మెడలో వేసుకుంటుంది. గుత్తుల సువాసనలు
అరచేతులతో అదిమిపట్టుకుంటుంది.
కావాల్నా నీకు,
సహజ శిల్పాకృతులు కిర్మీరవర్ణచిత్రాలు
'నానాసూన వితాన వాసనలు'
నేత్రోత్సవాలు శ్వాసానందాలు?
అడుగు: ఇచ్చేస్తుంది.
రాల్చిన వాటిని ఏరుకో. సెజ్జనిరపుకు తీసుకెళ్ళిపో.
ఏమీ అనదు. అన్నది వినబడినా అర్థంకాదులే నీకు
లిపిలేని పురాతన మాండలికం ఆకుభాష
నీ వ్యాకరణానికీ ఛందస్సుకీ ఒదగదు.

అయినా, తనది మౌనమే ననుకునేవ్‌ కాదు. అదో గోల,
సముద్రం ఆటుపోటుల్లా హోరు వెంబడే మూగితనం.

పురివిప్పి నర్తిస్తూ 'కే' మనే నెమలి
పొంచి చటాల్న గాండ్రించే బెబ్బులి
చిచ్చికొట్టి జోలపాడే తల్లి
చక్కిలిగిలి పెట్టే నెచ్చెలి.
ఎన్నెన్నో స్ఫురణలు!

చుక్కల దాగుడుమూతలు ఆటపట్టు
మిణుగుర్ల లోగిలి గువ్వగుల్ల గొడుగు
పక్షుల యింటికప్పు కూనల వలిదుప్పటి.
లేనిదాని కోసమని ఉన్నదానితోటి పోరాటాన
పసరాకు మీసాల కొసలమీద నునుగుండ్రటి
కాయల్ని నిలుపుకునే దక్షా. తేనెవన్నె చిపుళ్ళను
పసిడెక్కించే రసవిద్య, లక్ష గవాక్షాలు మూసి తెరిచే నేర్పు.
మబ్బుల్ని పిలిచి దించి జలధారలుగా కరిగించే మంచి.
గాలిపటంలాగ రెక్క విసిరి మృత్యువు తప్పించే సుబుద్ధి.
పెట్టకోసి జగదేక జనని. ఒగ్గుగా ఉండే త్యాగి.
నోటి తిండికి బొయ్యానుంచి పిల్లిని తేపే ఎర్రటి వేడి.
అయితే—

పిలవేట్లు వేలవేలగా యిక్కడొకటి అక్క
డొకటి పైకి రాగలదా, వచ్చి మరి చె
ట్టనిపించుకోగలదా ? అల్లుకోకుండా
సూర్యకాంతి వరదను తానే గుబురుగా
గుమ్మటంలా నిండుగా చూలాలు గాకుండా
వసన - కర్రల వర్తులాలు వర్తులాలు కమ్ముకోకుండా
విషవగ్ర కాకుండా అయాచిత సమాశ్రయం కాకుండా

నీ డెట్టా ? నిలకడ
ఎట్టా ? మనుగడ హాయి హాయి
మనిపించేదెట్టా ? నువే చెప్పవోయ్
అబ్బాయ్ !

గుట్టు నీకే గాదయ్యా, చెట్టుకీ వుంది :
ఊహల్నెక్కి వుప్పరాన వేర్లులేని క - వనం
వింత విరుల జాలరీలు తెంచి పరీక్షిస్తే
ఏ ముం ది ?
అంతుజిక్కని లోగుట్టు

బతికి బతికించే చెట్టు కిటుకు వేలాది
పొరల్లోపల్లోపల్లోపలే చిక్కుబడివుంది
నీ మీద వొట్టు!
నమ్మి చెప్పేది
పట్టుకో చూదాం
మనస్సుకి పట్టించుకో!

చెట్టుకి జలనాళికే కాదు సుమా, వేరు-
ప్రాణద్రవవాహిక కూడా కాదు-ధమనీ కాదు-
కాలిపట్టుకాదు కూడాను. చూడు దొరబడి

వేడుక వింతగుట్టు విచిత్రం
ఫలం పుష్పం పత్రం శాఖాసహస్రం
సమస్త వృక్షం
బీజ నిక్షిప్తం. గుప్తమనుకుంటే తప్పు:
బీజానిక్కూడా అండాశయం భూమే!

8-3-1982

మూలీదు

# హర్రోజూ నెలపొడుపే

పోరి పాటల సందడిలో పుడుకెక్కిన పల్లెజనం
బెదురుదీరి చేవెక్కిన పోటుబంటులవుతుంటె
పొద్దుపొడుపు వెలుగువలె లావా పొంగుతుంటె
గరికపోచ గరుసుబారి కత్తిగ కరుకెక్కుతుంటె
గడీగోడలను పట్టి బక్కపెద్దు కూల్చుతుంటె
దొరల గుండె దడదడలకు 'కేంపు' వంతపాడుతుంటె
లాఠీలకు జవాబుగా గుడిసెల కోలాటముంటె
రివాల్వర్ల హుంకారం కంపరమెత్తించుతుంటె
ఎదురుకాల్పు కట్టుకథలు పరికిసుందు తాపిస్తుంటె
జై జై సంఘం ముందున జనం దండు కదులుతుంటె
ఆచరణకు సిద్ధాంతం నడకలు నేర్పిస్తుంటే
వ్యూహానికి తగిన యెత్తుగడలు ఫలితమిస్తూంటే
ప్రాపిండిగ్గర శిబిరం మారుమోగి పోతూంటే
రక్తం లోపలి సారం శక్తిరూప మెత్తుతుంటె
మంచుకొండ విరిగి నీరు కెంపు మీరి దుముకుతుంటె
రారా మని పోరాటం పేలి విస్తరిస్తూంటే—

కటకటాల తలవంపులు ఖైదు కొట్ల లజ్జలోన
ఒంటరిపాటెంత సేపు? ఎంతటి దీనలత, కలత?
ఖైదీమది అమ్ములపొది, ఒరబెట్టిన ఖడ్గలత!
కోర్టూ జైలూ లెక్కేం? లెక్కేం కష్ట శిక్ష?
లోకం తన లోపటి నిధి లోకులలో తానే నది!
రేపటి దాకా ఎందుకు? హర్రోజూ నెలపొడుపే!

'సృజన' 1982 మార్చి

# జల మహోద్యమం

పెనబడుతూంది వ్యాకులమై సంకుల నీలద్రవం
నురుసెత్తుతూ సంఘటిత తరంగం ఉరుకుతూంది
శూన్యంలో నిట్రటంగా నిలబెట్టుతూంది సహస్ర శిఖర శీర్షం
ఝంఝరు జటాజూటం విదిలించి ముత్యాలు వర్షిస్తూంది
మహాజలకుడ్య తోటి స్థలావకాశానికి పన్నుతూంది దిగ్బంధం
బొగ్గా తెరుస్తూంది అగాధ పాతాళ గుహాలాంటి అంగిలి.

విహ్వలిస్తూ పిరిగి చెదురుతూ [illegible]తూంది నీటి ముట్టడి
ఒంటికాలిపైన లేచిన అల [illegible] తీరాన [illegible]
పీతల్నీ నత్తల్నీ ఒడ్డున కక్కేసి వెయ్యి నాలికల్తో ఇసకని నాకుతూంది
మేలిమి బంగారు మట్టికి బొగ్గు చారికల మురికి పూస్తూంది
వెనక్కు తిరిగి ముక్కలుగా చినిగి ఘోరపతనం తప్పించుకుంటూంది.

ముందుకురికేందుకే వెనుతగ్గడం
ఉప్పొంగేందుకనే వంగి కుంగడం
హోరెత్తడం కోసమే మూగనోము పట్టడం
అల్లకల్లోలం నిమిత్తమే హఠయోగం.

ఉప్పునీటికి ఒంటిచెమట జతజేసేవాడే కడలి ముద్దుబిడ్డ
క్షేమంగా అలల్తోటి ఆటలాడుకునేవాడు తుచ్ఛమైన మట్టిబెడ్డ
మీగాళ్లకు నురుసు చుట్టించి మురిసేటివాడు పిరికి పంద
కెరటం తోపుకి నీటి ముంపుకి నిలిచేవాడే మొనగాడు !

సూరీడు

తిరుగుబాటునే తప్ప భంగపాటుని ఎన్నటికీ ఆమోదించని నిర్ణయం
అక్కడి అస్తమయానికి ఇక్కడ ఉదయాన్ని తయారించే వ్యూహం
సదా ఆకాశాన్ని ధిక్కరించి భూమికి కాపుగా మెలిగే స్నేహం
రాత్రి గుట్టు పగటికీ పగటిరట్టు రాత్రికీ అందించే ధైర్యం
ఈ కెరటాల సంపుటం స్వరూపం నిరంతర పరిశ్రమం
మరి, స్వభావం – పతన, అభ్యుదయ బంధుర మహోద్యమం !

'యువ', 1982 దీపావళి సంచిక

## 100

# చావుని ధిక్కరిస్తూ

ఉలిక్కిపడింది ఊపిరి బిగబట్టింది శిబిరం
దాపౌతూంది సాయుధమైన హంతక దౌర్జన్యం
టాంకుల మెషీన్‌గన్ల పిస్టళ్ళ మూకుమ్మడి దాడి
తెగింది సందడి
గాలి వేడెక్కింది
గుమ్మంవద్ద గుండెపట్టుకునిల్చుంది విహ్వలిస్తూ ప్రాణం
వైట్‌హౌస్‌లో రీగన్
టెలవీవ్‌లో బెగిన్
బీరుట్‌లో షారన్
శిబిరాలలో ఫెలాంగిస్టు సైతాన్

డేరాకాదు శిబిరం
గుడారంకాదు సత్రంకాదు
లెబనాన్‌లో కాలునిలదొక్కుకున్న అరబ్ జనసమ్మర్దం
దిక్కుమాలిన పిట్టలు వాలిపున్న చివరి చెట్టు కొమ్మ
చీకటిలో మిణుగుర్ల కాంతి నృత్యం
దుఃఖంలో దైన్యంలో ధైర్యచిహ్నం
స్వేచ్ఛాఖడ్గం
దీక్షా దుర్గం
కాందిశీకుల శిబిరం

బుల్లెట్
బుల్లెట్‌మీద బుల్లెట్
బుల్లెట్ వెంట బుల్లెట్

చీలి పేలికలైంది పాసినవ్వొకటి
ఊడిన నడుములు కుప్పగూలాయి
పాలిండ్లలోంచి రక్తధార
శిరస్సులో బిలం
శవాలు
శవాలు శవాలు శవాలు
బీభత్సం చేవ్రాళ్ళు
పీనుగ పెంటలోంచి దుర్గంధంలోంచి
మళ్ళీ వినవస్తోంది విలాపాన్ని మించి
సన్నగా మృత్యువును ధిక్కరిస్తూ ధైర్య విపంచి

మే. 1983

# ఊరోళ్ల బాస

వారీ నీ యేఁరిగాల  పూరిడిసి మళ్ల పోవాల్నా ?
కాలు నిలవదా, యేం ? జనం మూఁబలం గదా !
అచ్చెఁరంగా వుండది అంతుజిక్కనంటుండది
ఆలోశిన నీది మాకు అర్థాఁవ్నం తీర్గ వుంది

పూళ్లొ నేవాఁ ఒక్కకాలు, పూరవతల రొండోదా ?
దొర్లకు తెలవాలి కూలిజనం గొఁర్లు గావాల్నా ?
పోలిసోని కావరమే సుళ్ళి అమల్ జరిగాల్నా ?
'సంగం' సంగతి యెనకటి కత బాపత్ గావాల్నా ?     వారీ నీ..

పదక వేఁదా వుందంటవ్, పారేదా పారద్దా ?
పూరి కడివి కాపంటవ్, నమ్మడవాఁ, నవ్వడవాఁ ?
దండొక్కటి పుట్టుకొచ్చి గండాల్నే గడిపేనా ?
ఇచిత్తరమవుతుండగి, మతి సుదురే దప్పిందా ?     వారీ నీ ..

అడివి నిడిసి సరుసుబండి పూగుజేసె ననుకుంటివిఁ
ప్రెతీ దిగుడు దూకుపైన పూట గడిసె ననుకుంటివిఁ
'సంగ' వాఁకే వొక్కదిక్కు అనుకుని నెమ్మతి పడితివిఁ
జెండా లరకలరుగట్టి జై జై మంటరిస్తివేఁ !     ..వారీ నీ...

అదేవఁంటె విద్దతంత్ర శాస్త్రమని సెబుతుంటివి
ఎత్తుగడలు మారకుంటె చిత్తయిపోతామంటివి
సరే నయా, పోవయ్యా ! మేవుఁండం ఆళ్లుండరు
మేవోఁ ఆళ్లో ఎవురో వొకరే నిలవక దప్పదు !     వారీ నీ....

—మారీదు

పోతే పోనీ పేనం పొలంసెలక మేమిడవం
కొట్నీ రగతం కార్నీ మన్నే మందికి జీవం
గెంట్నీ జెవిల్లదోయనీ నోటికాడి కూడొదలం
'సంగం' నేర్పిందల్లా నిలబడ్డం పోట్లాడ్డం! .. వారీ నీ .

నిలబడి కొట్లాడి మేము నేలకొరిగిపోయినాంక
మా కపాలె సత్తవగా మారి పాటమన్నయితే
పిల్లాజెల్లా యెదిగి సేసూకుంరా మిగిలీ
బూదేవర దయపరిస్తే పండు గాటలా బువ్వే! ....వారీ నీ....

'సంగం' కనుజూపిస్తే నువ్వెగళ్ళ నెగదోస్తే
ఇవరంగా ఇశదంగా యిసారం ఇనిపిస్తే
ఈ సేతులు ఈ కాళ్ళే ఈ గొంతు నమ్మెటలైతే
'సంగం'తో మేముంటం మేమే 'సంగం'గుంటం! ....వారీ నీ....

జెండెప్పులది? జనాల్లిగది! దాన్నెరన మారగతమే!
నేలెప్పులది? పూర్తిగా గారిపదును మాశవమే!
ఏలెటోడు ఎప్పులంటే నడుగాంచేటోడే గద
నిలువంటాం సుప్పుమట్టుకి పుణ్యకన్యకుండాలె ....వారీ నీ....

పొయ్యేటప్పుడు పేనం పొచ్చేటప్పుడు లాబం!
నీ పతకం పారిందో, దొరబ్బురతలుండరాదు
ఆలోశిన పండబారి ... బూదేవర మాకచేరి
"సంగం" మాపైన జెండె జనాల కండాసండా! ....వారీ నీ....

1983

# నెత్తురు గుడ్డు

అరుణాచల్ ఎక్కి మేఘాలయను తాకు, చూద్దాం ?
ఆర్ద్రతా నీ చేతికి తగిలేది ? క్రోధాగ్ని తీవ్రతా ? చెప్పు, విందాం !
నాగాలు మిణ్ణాగులయ్యారంటావా, అనవా ?
మిజోలు ధనుర్జ్యావల్లులు కాలేదా ?
కామ్‌రూప్ ప్రజ్వలించే కామాఖ్యశక్తి రూపిణి అయింది
పుక్కిలి తన పురాణాన్ని వుమ్మేస్తే,
ప్రాగ్జ్యోతిషం రక్తతైలంతోటి దీపావళి భీకరవర్ణ చిత్రం
త్రిపుర ఆదివాసి త్రివిక్రమపాదం బెంగాలీ బలిబాబు శిరస్సున వుంది
చక్రవర్తి నామధేయుడు నృపేంద్రుడు !
ఆహోమ్ జాతి దీనస్థితి విదిలించుకు హృదయ దుందుభి మోగిస్తూంది
ఈశాను పై ప్రమథగణాల్ని ఎగదోలుతూంది ఈశాన్యం దక్షాధ్వరం మీదికి
దృశ్యం పిడుగు పిండమయం.

బ్రహ్మపుత్ర కిద్దరి దుర్భేద్యమైన ధిక్కార దుర్గ నగరి
శివసాగర్ ఘూర్ణిల్లుతూంది స్వాధికార వజ్రదీక్షతోటి జాతులఖైదు
'దిబూ' స్థావరాలు వణగ్గా అన్య ప్రాంతీయులకు అర్ధ చంద్ర ప్రయోగం
దోచివేత వంటినిండా వాతలు, ముసుగులూడిన దగా దొంగముఖం
దరిద్రాన్ని తలమీదినుంచి తోసి పొలిమేరల్దాకా తరుముతూంది జనం
స్వదేశీయుల దైన్యం హైన్యం అంతరిస్తూన్న ప్రజాస్వాభిమానం
మాతృభూమి మమత వుగ్రం మహోదగ్రం కావిస్తున్న చైతన్య జ్వలనం
అరణ్యంలో దావానలాని కెన్నిరూపాలు, ఎన్ని నాలుకలు

సూరీడు

కుంకుమపువ్వాల కాశ్మీర్ కెంపు వన్నె కన్నెర్రగా మారుతోంది
మొరాదాబాద్ 'ఈద్గా' కాల్పుల శబ్దం అలీఘర్‌ను కుదిపేస్తోంది
చోటా నాగ్‌పూర్ పేదరైతుల్లు చేవెక్కి చిందుదొక్కుతున్నై
సంతాల్‌ల పిల్లంయి బోట్ల ఇచి బోల్దారి మూకల నోటిచేదు
'మహువా' రస-ముత్తు తలకెక్కి శివమెక్కి ముండారీల హోరు-విందు
ఘోక్స్‌పూర్ గూడెలు భీషణాగ్నిజ్వాలల్లో నానా సేనలకు శవ పసందు
రంగ్‌మిటియా ఉదార్బ్యింగ్ ఒర్వితాలిప్పుడు నవజవ-జటాయువులు
గోండ్లు, పరధాన్లు, జాతా లు, సవర్లు, కోయులు, చెంచులు పీరాంజనేయుళ్ల
పోడు సాగూ గొలంపునీ కలిపిన చేతులు కత్తులకైనా తెగని గట్టిలంకెలు,
కిందిది మీదూ మీదిది కిందూ అవుతున్న మంటల్లో వంట.

నాగావళి నగి తరగలు బాహుదా నదికి అందిస్తున్నై వురుకులు
తుంగభద్ర మంజీరకూ, పెన్గంగ శారదకూ నేర్పుతున్నై చురుకులు
నిప్పుదూడని శ్రీకాకుళం నిప్పు గోదావరి రెల్లులో గప్పు గప్పు మంటూంది
బెల్లంపల్లి బొగ్గుగుట్టల నలుపు జగిత్యాల ఎరుపును నోరారా పలకరిస్తూంది
వెలిగొండల నిప్పు నిట్టూర్పులు తంబళ్లపల్లి మీదుగా కొండలోచర్ల
కందుతున్నై
తిరుప్పూరు ఏళాగిరికి గెరిల్లాల రక్తధారలు అభిషేకాలు చేస్తున్నై
సిర్సిల్లా దొరతనాలు పోతుమీసాల కొసలు వదులై రాలిపడుతున్నై
నర్సంపేట దుండగాలు నల్గొండ దుర్ణయాలు తెల్లకామ్రేడ్ల రంగు చూపుతున్నై
రంపచోడవరం అల్లూరి సీతారామరాజు పోరాట వారసుల రక్తత్యాగం చూస్తూంది
అతలాకుతల మవుతూంది జనతా ప్రపంచానికి వర్తమానకాలం.

## 106

దేశం లోపలి దేశం అంతులేని ఆక్రోశం నిండిన స్వరకోశం
ఏకం లోపలి అనేకం ఎక్కడికక్కడ కదలిపోయే సంచలనం
నిదరకళ్ళు నులుపుకుంటూంది ఒంటికంటి రాకాసి దొరతనం
పదపదమంటూ తోసుకొస్తూంది కదంతొక్కే ఆయుధ ధైర్యం బలగం
పాలకుల పన్నాగాల పన్నగాల నడుములు విరక్కొపోవు రేఖ
భవిష్యత్తు కాలగర్భకోశంనుంచి బాధగాతోసే నెత్తురుగుడ్డు
కొండమీదికి బండలు దొర్లించుకుపోయేపని ఎంత గడ్డు !

12–5–1985

# చుక్కదున్నను చంపిన వీరుని కత

పేటకే మాగాణి సిరిందదన్నా
వరి పండపండింది చప్పుదెక్కెనన్నా
బొలకల్లు పడగానె దుక్కిగున్నారా
తడి ఆరకుండానె విత్తనం చల్లారా
నాటు నారేగాని పైటుగాలేదు
గరుకు బారనులేదు గంటకల్లేదు
పెనకజిక్కేసింది ఎదిగొచ్చినట్టె
వెన్నుపిడపంగానె ధాన్యమైనట్టె
గింజ జొన్నపాలంసే గట్టబడితేనా
గట్టి గాదామైన గిట్టుబాటున్నా
పసుపు పచ్చని ఆశ పసిమెక్కలేదే,
పసుల కడుపులకింత కసుపండలేదే
గట్టు గనిమలు ఎలుగు కలుగులైపాయె
కరిగోడలే పందికొక్కు గిల్లాయె
కష్టమంతా కడకు నష్టానికేనా.
కయ్యి కయ్యంత దయ్యాలు బొక్కేనా
ఎడగారు ముంచా, ఎండల జోరు ముందో,
కడుపాకలే ముందొ, కడగళ్లు ముందో
పోతరించిన దున్నపోలం మీనబడింది
పారపళ్లకు పచ్చనారు చిరుదిండి

తడిలేని చేనుమడి చెడబొక్కుతూంది
తనవెంట గొడ్లమందను దించుతూంది
నోటికీ గిట్టకీ నిండా పనిబెట్టి
నోరు జిచ్చిన సొంతదారు క -

మావోడు

రెండు కొమ్ములు విసిరి రంకె పెట్టిందా
కండకావర మేమొ కసుమాలతనమో
ఏమి చెయ్యడ మిప్పు డెట్ల చెయ్యాలో,
ఏ దీనరక్షకుడి దీవె నడగాలో
కట్టుబాటే లేదు కట్టడెక్కడిది,
కట్టుదిట్టమె లేదు కూటమెట్లాగు
బీడుగాని మరి బంజరుగానీ లెక్క జమాలేదు
బీదగుడిసెలని బక్కజీవులని జాలి దయాలేదు
ఊరి బజారో వలపలిమిట్లో శిరసే వంచాలె
మారుబలికితే వాడికొమ్ములను చరచర దిప్పాలె!

* * *

నకనకలాడే డొక్కలతో సన్నటి మెత్తటి గిట్టలతో
లేగదూడ వచ్చిందిరా లేమిడి వెంబడిగా !
ఈచుకుపోయిన కాళ్లతో అర్చుకుపోయిన గొంతుకతో
దిక్కుమాలి వచ్చిందిరా దేబె మొగంతోటి !
చొంగలుకార్చే నోటితో లుంగచుట్టుకొన్నాకటితో
వంగి వంగి వచ్చిందిరా నంగిఘోషతోటి !

ఉదగిరి సీమనుంచొచ్చింది నెల్లూరి నడిబొడ్డు చేరింది
లారీలు తుడిచింది మురికిపనిజేసింది చమురున్న నేలనే నాకింది
పెరిగింది శాపమై తిరిగింది తాపమై ఇంతలో పురువెక్కిపోయింది
డాక్టరన్నను చేరి చెప్పిన పనుల్జేసి నమ్మకం రాబట్టగలిగింది
సుద్దులెన్నో నేర్చి పెద్దరికమూ పొంది వైద్యరంగంలోకి దూరింది
బుద్ధి నేర్పిన పెద్దవాళ్ల కన్నులు చెవులు మూసివేసే విద్య నేర్చింది
చాడీలు కొండేలు చెప్పుతూ పెత్తనం గుర్తింపు నెట్లనో పొందింది
రోగమే రొక్కమై ప్రజలంటె పైసలుగ వైద్యాన్ని అర్థనగ మార్చింది
దుర్బుద్ధులే పెరిగి దీమసం తలకెక్కి దూడ మకిలి దున్నయ్యింది.

తాజేసిందే ఒప్పు - భళి!
తాజెప్పిందే తీర్పు!
తానేమన్నా చెల్లు - భళి!
తక్కిందంతా బొల్లు!
చుక్కదున్నపోతా యెలా ఉక్కుపోత బొమ్మయ్యిందా!
భళానోయి భాయి తమ్ముడా! భాయి భళానోయి దాదానా!

ఉరానుగా ఎదిగొచ్చిందీ - భళి!
ఉస్తాదుగ పేరొచ్చింది!
తోటి దున్నలకు జగడెట్టి - భళి!
తక్కినవన్నీ తన పెట్టె!
నానాహూళ్ళే కుడిపించీ - భళి!
దాణాలే రుచి మరిగింది!
లారీ భారీ లన బరువు - భళి!
లాభాలేవో చిదుడిస్తు!
పెద్దరికం పగవేషమురా - భళి!
పిదప బుద్ధులూ మోసాలు!
రక్తం కళ్ళ జూచిందీ - భళి!
శక్తి తంత్రమే చేసింది!
రంకెను రొక్కం చేసిందీ - భళి!
బొంకు బొక్కసం నింపింది!
పెద్దలాట కట్టించిందీ - భళి!
పెగ్గె తనది చూపించింది!
భళానోయి భాయి తమ్ముడా! భాయి భళానోయి దాదానా

తనమాటే వేదం తలముట్టే ఆయుధం
తన తనమే పెత్తనం తన ఆటే ఆగడం
తనోళ్ళకే గుండె బెదురు తనోళ్ళకే చుక్కెదురు

మావోడు..

తనా మనా అనేలేదు తనదొక్కటే కుదురు
పొరపొచ్చాలే కక్షలు పోటీదార్లకు శిక్షలు
పొరల్గమ్మితే కన్నులు పిడుగులు రాల్చే మిన్నులు. . .

వైకుంఠంలేదూ కైలాసంలేదూ
అది తలచుకుంటే
ఇసక దిబ్బలయినా నుసి నుసి కావాలె!
అది తలచుకుంటే
ఇళ్ల స్థలాలయినా బీళ్లుగా నిలవాలె!
అది తలచుకుంటే
పత్రనేలలయినా పంటల నెర్రాలె!
అది తలచుకుంటే
లంచమిచ్చినోడికే కంచం నిండాలె!

ఏవిఁట్రా దిక్కు? ఎపుడయ్యా మొక్కు?
దిక్కు మొక్కులేనోళ్ళకు రేడికల్సే ఉక్కు!
జనం తలల నాలుకలు ప్రజల చేతి పిడికిళ్లు
చీకట్లో టార్చిలైట్లు వాళ్లు యువక నగ్జలైట్లు!
పల్లెటూళ్ల అక్రమాల పాలి గండ్రగొడ్డళ్లు
పేదల పేటల బాధలు తొలగించే మొనగాళ్లు!
పంటపొలం, ఇళ్లస్థలం సమస్యలకు కొడవళ్లు
నోరు వాయి లేనోళ్లకు తామే డాళ్లు దవాళ్లు!

వాడేరా వీరుడు వాడేరా శూరుడు
శ్రీధరుడంటే వాడే వాడేరా పనిమంతుడు
పోటుబంటు వాడేరా పిల్లపిడుగు వాడే!

వావిళ్ళ పొత్తిళ్ళు విడిచి నెల్లూరి పొత్తులే కలిపి
వకీలు వృత్తి దిగవిడిచి వుద్యమంముందు నిలిచాడు ॥వాడేరా...
మాల మాదిగలుచేసే కూలిపోరు మొగదారై
చాకడిపో అవకతవకలకే బుద్ధిజెప్పాడు॥ ॥వాడేరా. .
పడుగుపాడు పడుగుపేక దుప్పటి దుప్పటి చిక్కటినేతై
ఇనముడుగున కాళీయుల తన్ని తొక్కబూనాడు ॥వాడేరా...
జడ్జిగాని జడ్జీగా జనం తగూలు తీరుస్తూ
గాలివానలో కూలిన గుడిసెల నిలబెట్టినాడు ॥వాడేరా...
పోలీసోని పిల్లంగోవి పెటపెటమని విరగంగా
రిక్షావాళ్ళ ఒంటిదెబ్బలకు మందు నూరినాడు ॥వాడేరా....
వైకుంఠపురం ఇళ్ళస్థలం వ్యవహారంలో దున్నకు
ఎదురునిలిచి ఎంతంటే నువ్వెంతని పంతగించినాడు ॥వాడేరా....

"భయం వద్దు జయం కద్దు
రండి రండి కలబడుదాం'
కలబడకుంటే నిలబడలేం
నిబ్బరముంటేనే గెలుస్తాం'

"ఉందిరా ఉంది - దారి
ఉందుంది!
ఉందిరా ఉంది - ఇంక
ఉండ దిబ్బంది!

"ఒక్కరిద్దరు చాలు తోడు - వహ్వా!
టొక్కటోర్లే వస్తాదు!
ఒంటరిని చెయ్యండి చాలు - వహ్వా!
తుంటరికి దుమ్ము చేర్రాలు!
రండి! రండి! రండి!"

**మావోడు**

పట్టపగలే అయితేనేం? పల్లీకున్నయితేనేం?
పట్టణంలో నయితెనేం? పదుగురింకా మసిలితేం?
నేలవగనే మరవరాదు పైరువగనే మరవరాదు
బలహీనవర్గం వేలవగలకు చాలు నొక్క జవాబు
పగ వ్గపగ .. పగ .
పర్గపగ !

లేదా నీలో తెంపు ?
రాదా కళ్లకు కెంపు ?
ధైర్యమా ! తరలిరా ! నాతోడు నిలుపు !
శౌర్యమా ! కదలిరా ! నా వెంట నడువు !
విశ్వాసమా ! నాల్గు దిక్కులా నిల్చో !
ఉఛ్వాసమా ! ఒక్క క్షణం నువ్వాగు !

కన్నార్పలేదు పొద్దు
కంఠస్వరాల, కాలి అడుగుల సద్దు ఆగలేదింకా
సాయంకాలం పరిసరాల నింకా వదల్నేలేదు
సందెచీకటి నల్లటిజాలరీ దిక్కుకి కట్టలేదు
పిందె చుక్కలు కూడా తొంగి తొంగి చూల్లేదు
వింతా ? వినోదమా ? కాదు !
అంతా మామూలే ! చోద్యం ఏమీ లేదు !
అయితే యింతట్లోనే...

వస్తూందిరా దున్న వస్తూంది
మస్తుగా మేసి పదస్తుగా వస్తూంది
ఒంటరిగ వస్తూంది ఒరుగుతూ వస్తూంది
అదుగుమీదడుగుగా అదురులేకొస్తూంది

కమ్ముకో : పోనీకు :
చుట్టుకో : పోనీకు :
అడ్డుకో : పోనీకు :
ఎదురుకో: పోనీకు:

చిక్కిందిరా: సై
నిల్చిందిరా: సై
చూసిందిరా: సై
ఆగిందిరా: సై
దిక్కులే చూసింది దిగ్భ్రమే చెందింది
వాక్కు పడిపోయింది బిక్కుబిక్కుమంది

"ఎటుదూరి ఎటు పారిపోగల్నో?
ఎట్టెగిరి ఎటు వాలి పోగల్నో?"

దూకింది బరిసె దూకింది బడిసె
బాడిచింది కత్తి దూరింది ఈటె
తోసింది తోపు కూల్చింది టోపు
ఇదిగో కత్తి
అదిగో మిత్తి!

నెత్తురుకాదు కొండ శరీరంనుంచి వాగై దూకింది
నల్ల :
బొట్టుబొట్టుగా కాదు, ఎత్తిపోతగా ఎర్రనకాదు
నల్లన :

నేల ఒళ్లు జలదరించింది వీధి పులకరించింది
దుర్మార్గాల మాలను మెడలోనుంచి తెగదెంపింది నెల్లూరు
ఊపిరి చెరవదిలింది
నాలుకమీదినుంచి నాలుకమీదికి సాగింది సంతోషం రుచి
కళ వచ్చింది పొలం ముఖానికి
ఊరవతల పాడుబడ్డ గుడిసెకప్పు మీదినుంచి
ఎర్రజుత్తు కోడి తలెత్తి తొలిజామున కూసింది శ్రుతిమించి

10–11–1985

హాలీడు

# కార్తీక పూర్ణానుస్వారం

తుఫాను వానకారు చూపలేదింకా తన మామూలు జోరు
అచ్చు వెన్నెల - మొగ్గ విరబూసి చూపలేదింకా రేకులబారు
కానైతే, పంచాంగ ప్రమాణం బట్టి ఇది కార్తీకమే విధిగా
మీదు మిక్కిలి, ఈ రాత్రి పున్నమ కావలసిందే తిథిగా....
మరందుచేతే కాబోలు, యీ సంబరం, సందడి
పురకలూ పరుగులూ, యింతటి తొడతొక్కిడి !

ఇటు నెత్తుట్లో నానిన 'సురిన్హ' త్రిశూలాల ఎర్రడాలు
అటు బొగ్గులా మాడి నల్లటి చీలికలు పదునెక్కే మేఘాలు
పట్టనడమ కంది గుండు సున్నగా రూపొంది చంద్రబింబం
కంటికానక సాగే 'నీలతార' చర్యకు ప్రత్యక్ష ప్రతిబింబం....
ఘూర్ణిల్లే గుర్‌ద్వారాల కన్నిటికీ ఇదే తద్దినం
గురు పూర్ణిమా గురునానక్ జయంతీ సమ్మేళనం !

ఇక్కడొకటీ అక్కడొకటీ తప్ప విశాల ఆకాశ స్థలంలో
మాడచక్కని చుక్కల వుద్యానవనమే కనిపించడం లేదు, చోద్యం !
పల్లె పట్టణాల్లో అరక్షిత ప్రాణాలే అంగుళ మంగుళంలో
ముఖారి రాగాలాపన మూర్ఛనలు పలికిస్తున్న శోకవాద్యం...
రక్తాక్షులైన జ్వాలాముఖగణాల విజృంభణ
శాక్తేయ రాజ్య దుస్తంత్ర పలాయణుల దురాక్రమణ !

కన్నీళ్ళ కుండపోత వాన కురిపించే రక్కసి మేఘ విలయ విహారం
కుమ్ములాటలు దొమ్మీలూ ఖూనీలూ లూటీలుగా విధ్వంస వికారం
విచక్షణ నశించి దురుద్రేకం ముదిరి చట్టం చట్టుబండలైన
విపత్సయమం
శాంతి - భద్రతల సంరక్షకులే తక్షకులై పరీక్షిత్తులను హత
మార్చిన దృశ్యం
నానక్ జయంతి నాడే అతని జనం అవాక్కయింది
వాతావరణం ప్రేతకళతో మరణావరణమయింది.

గాయాల పుళ్లు సలుపుతున్న అవమానం దుర్భర మనస్స్థితి
ఆయుధాలకంటె మరీ అధఃకరించే జాలి - రూపం నుంచి భావవికృతి
మితిమేరాతిప్పి అధికారదర్పం కాళసర్పం సాగించిన మారణకేళి
నీతీ నిజాయితీలేని ఆరోపణల 'శ్వేతపత్రం' మీద అబద్ధం వాహ్యాళి.
రక్తం వాంతిజేసుకుంటోంది దేశ అఖండతపేరున శాంతి
శక్తి పుడుగుతూ క్షయగ్రస్తమైన భద్రత కేవలం చిత్తవిభ్రాంతి!

తూటావేట్లకు పెచ్చెలూ పెళ్ళలై రాలిన హర్మందిర్ సాహెబ్ భవనాగ్రం
టాంక్ ఫిరంగుల గర్జాఘోషలతో చెవుడెక్కిన అకాల్‌తక్త్ ప్రాంగణం
మృతకళేబరాలు వూరి వుబ్బి గబ్బులేపిన అమృత్ సరోవరం
భీతితో ఆర్తితో తల్లడిల్లిన స్వర్ణమందిర నిర్జనావరణం....
'ఎదురు కాల్పులూ' 'చిత్రహింసలూ చాటే వాస్తవమైన కథ
ఒక మతవర్గాన్ని మొత్తంగానే బోనెక్కించిన అక్రమగాథ!

ఎటుజూచినా కొడిగట్టుతూ కొండెక్కుతున్న ప్రాణ-దీపాలే
తాటాకు గుమ్మటాల్లో ఇంటింటా కార్తీక దీపా లెక్కడివిలే!
రెల్లుపూత అనిపించే గురునానక్ పొడవాటి దాడీ బదులు
చెల్లాచెదురుగా పులి-బెదురు వేళ్ళలాంటి శిక్కుల గుండెహడలు....

హారీదు

పిండారబోసిన పసిడిరాశిలా గుండవలసింది పోయి
ఇందిర చితాభస్మం ప్రియదర్శనానికి ఊరేగే రేయి!

పొగలు రేపుతూ మత - పగలూ పంతాలూ కమ్మేసి పంకిలమైంది రాత్రి
వధావినోదంలో శవబీభత్స-వుత్సవం ప్రదర్శిస్తూంది భూతధాత్రి
సజీవదహన కిరాతకళలో ఆక్రోశిస్తూ వాయువైంది నీరసశ్వాస
'మహామాంస విక్రయ' వీధికెక్కింది గృహాల విహ్వాల మానవభాష....
నిజంగానే లౌకిక రాజ్యమా, ఇది
మత - మదపిచ్చికి పెట్టిన భోజ్యమా?

వంచన లింగాన్నేగాక ప్రాయాన్నీ మార్చుకుని జేజే లందుకుంటూంది
వంశపారంపర్యాధికారం సలక్షణంగానే పట్టాభిషేకం జరుపుకుంటూంది
నిరంకుశత్వం తన పశుముఖానికి తగిలించుకుంది పరమ శాంతాకారం
స్తోత్రాల పేర్పుల కిందినుంచి లేవలేక విలవిల్లాడుతూంది సదాచారం....
ఆక్రందనల వేలాది నోళ్లు మూస్తోంది భజన
అక్రమాలమీద ప్రభుముద్రిక గుద్దుతూంది కీర్తన !

యువరాజీవం విరబూసిందో లేదో, కుళ్ళకంపు సుళ్ళు తిరుగుతూంది
అమ్మ-శక్తి మిగిలించిన బూడిద దేశం నొసట దిద్దుతూన్న విభూది
రుద్రాక్ష మాలకు ఊరు దుర్మృతుల ప్రాణాలదండ మెడలో వేసుకుంది
యమలాళ్లు సృష్టించిన రౌద్రరుద్ర భూముల్లో "ఓమ్ శాంతి శ్శాంతిః"..
జీవం విలువపడి హత్యాధర లకారం పలుకుతూంది
క్రూర నేర రాచకీయం జెబ్బ చరిచి విర్రవీగుతూంది !

మావోడు

దేవాలయాల్లో జగద్గురువు వెలిగించండన్న ఇందిరా మోక్షదీపం
దేశప్రజల కపాలమోక్ష - దీపావళికి ప్రత్యామ్నాయం కాగలదా ?
కర్ సేవ వెల్లవేసుకుని రాకాసుధలా రాణించగలదా ఘోరపాపం ?
దుర్మార్గం పాదపూజలందుకుని అగ్రతాంబూలం స్వీకరించగలదా ?
పశ్చాత్తాప ప్రకటన అసంఖ్యాక ఘాతుకాలకు సరికి సరి ధరా ?
వృశ్చిక సంతతికేనా ఇకపై ప్రజాస్వామిక రాజేందిర ?

జాతా యిది, పీనుగ పాతరా ? దమ్ములుంటే జవాబివ్వు ఖండితంగా !
దేశమా యిది, విద్వేష విషకోశమా ? నిజాయితీ వుంటే చాటు నిబ్బరంగా !
వర్ణం వర్గం లింగం విభేదాలు నేలతల్లి రొమ్ముల్ని కోస్తున్న రంపాన
పీడిత-ప్రజఎలుకతో పాలక-పిల్లి చెలగాటమాడుతూండ పెంచిన....
ఇంటి దీపాలార్పి వెయ్యకుంటే, పదివేలు
కార్తిక పౌర్ణమికీ నానక్ జయంతికీ దణ్ణాలు !

1985

# నిప్పుల గుండం

ప్రస్తుతి చరిత్ర మాత్రంకాదు నేనిప్పుడు రాస్తున్నది
మృత పదార్థాన్నో శిలాజాన్నో తవ్వి తీయడంలేదు
కతలు జెప్పి కల్లల దండ లల్లాలని గాదు
కొండడో అనుమడో కాకతి గణపతో రుద్రుడో నాయకులు కారు
రాణె సర్వప్పో విద్యానాథుడో నా మది కెక్కరు
బమ్మెర పోతనో పాల్కురికి సోమన్నో ఆవేశించరు
కేవలం వర్తమానమే నా శ్వాస
కాని
నా ధ్యాస మహత్తర భవిష్యత్ వాస్తు.

నీలో నా బిడ్డల్లు దర్శించుకుంటున్నాను.
వరంగల్ ! నీ బలిష్ఠ బాహువుల్లో ఉయ్యాలలూగుతున్నాను
నీ రోడ్ల మీదుగా రక్తనాళాలను వేసుకుంటున్నాను
నా ఆరంభ ప్రస్థానానికి ఏతమెత్తింది నీ ఉద్ధత యవ్వనం
నీ నాడి పట్టి దేహం రక్తపోటు గ్రహిస్తున్నాను
నిప్పుల గుండం తొక్కుతూ నెత్తురుమడుగులో నడుస్తున్నా
వరంగల్ ! యుద్ధబాధల అగాధంనుంచి పైకి లేస్తున్నావు
ఎప్పటి కప్పుడు ప్రాణగండాల నుంచి బైట పడుతున్నావు
మొగ్గ విరబూస్తున్నది రేకొక్క బాకుగా గరగరమంటూ
ముఖాన కఠినహాసం గట్టిపడుతున్నది భీకర సుందరంగా
కళ-కత్తి సాముజేస్తున్నావు ఒడుపుగా ఓర్పే నేర్పుగా
విరసం పాఠం కుఠారమై గాటమైన గాతాలు తీసింది నీలో
చరిత్ర కాదు నేనిప్పుడు రాస్తూవున్నది....

**మావోడు**

గాడుపు మోసుకొస్తున్నది రోదనేనా ? గర్జన కూడానా ?
లాడా బూట్లకు వడిలే పచ్చిక తలదించిందా ? చివాల్న ఎత్తిందా ?
చినుకుతూనేవున్నా చల్లబడుతున్నాయా తారురోడ్లు? చురకలెడుతున్నాయా?
చెదారం సుడుస్తూవుంటే ఆ యెగిరేది కరపత్రం చింపా, తెగింపా?
శబ్దారణ్యం గుండెల నదరగొట్టుతున్నది బాధాక్రోశమా, రోషావేశమా?
ఆర్సీసీ జనశ్మశానం కంపించేది ప్రాణార్తితోనా, నిర్భీతి లోనా?
ఆర్ యస్ యస్‌తో పోలీసు లంకెకు అర్థం హైందవహింసా, క్రౌర్యరిరంసా?
కాంట్రాక్టర్ల వెట్ పార్టీ లక్ష్యం ప్రజలపట్ల సురక్షా, రక్కసికక్షా?
అడవిపంది ముళ్ళు అన్నీ ప్రశ్నలే
అయినా అన్నింటికీ ఉన్నై జవాబులు
సన్నీ మెత్తటిపోట్లు అన్నీ సవాళ్ళే
కానీ, అన్నిటికన్నీ ఎదురు సవాళ్ళు ఉన్నై
ఒక్కటే ఇంకా అంతుబట్టడం లేదు
చిక్కుముడి ఎలా తెగాలి?
బైటబడి వూపిరి పురి ఎలా విప్పుకోవాలి?
యథార్థానికీ ఆదర్శానికీ మధ్య వూగులాడుతూంది నీ స్థితి
ప్రమాదం అంచుని కొనకాలిపట్టున తొక్కిపట్టుకుంది పురోగతి
నీ బాధాఖడ్గధారతోనే కాలం తన కుబుస మాడ్చుకుంటూంది
నెత్తుటి కన్నీటిధారలు తుడుచుకుంటూంది, ఎప్పటికప్పుడు
కండలురాలిపడుతున్న నీ అడుగుల వెంబడే చరిత్రకాలిచప్పుడు
వరంగల్! వట్టి చరిత్ర కాదు గదూ నేను రాస్తున్నదిప్పుడు ?

ఎక్కడి నాగావళీ మరెక్కడి ఏకశిలాపురీ
వంశధార వరదపోటుకు వూపెక్కిందా గోదావరి?
శ్రీకాకుళం వర్షసూచనకే అడవిములుగు ఒంటి పులకా?
బెజవాడ వడదెబ్బకెంతో దూరాన
హైదరాబాదునుంచా చైతన్య-రవాణా?
సెంట్ గేబ్రియల్ స్కూలు ఆవరణలో కెంపెక్కిందా ఆలోచన?

సూరీడు

వొడ్డేపల్లి చెరువు అలల కలకలంలోన విరబూచింది చేవ చెంగలువ
లష్కెట్ పేట ములుగంచెకు అల్లుకుంది చిక్కంగా కాశీరత్నం పూదీవ
ఉషస్సు రెక్కలు విదిలించినా పాతికేళ్ల నీ రాత్రి చీకటి విరగలేదు
వేడి వెలుగుల కోలాటంతోగాని కళ్లనుంచి మగత దిగిరాలేదు
భూతం నడ్డి ఎగిసెగిసి తన్ని
వర్తమానం జూలు వొడిసి పట్టి
కిరణాల కనుజూపులు వాడిగా మళ్లాయి రేపటికేసి
కొండపల్లెలోంచి సత్యప్రమాణంగా ప్రవహించింది వర్గకసి
నిక్కర్ ప్రాయం నుంచి ప్యాంట్స్ ప్రాయానికి చేరుకుంటున్నావేమో
వరంగల్ ! నీ పిల్లి గొంతు మారింది చెంప గరుకెక్కింది
యానాటమీ మీదుగా సోషల్ పేథాలజీ గ్రంథం చేబట్టావు
అరిథ్మెటికల్ ప్రోగ్రెషన్‌గాక జ్యామెట్రికల్ ప్రోగ్రెషన్‌మీద
గురి నిలిపావు
టెక్స్టు బుక్స్ విడిచి ఇన్స్ట్రుమెంట్స్ కిట్ నందుకున్నావు
వెంపటాంటాం వినిపించింది కదూ నీ కప్పుడు ?
జముకుపాణిగ్రాహి ఎరుపు పాట కూడా కదపలేదూ ?
తిరుగబడు మన్నాయి జీరవిడే నవశంఖారొక పది
మార్చి ! అన్నది సంఘటిత యువ సంకల్పం షట్పది
చలినెగళ్లతో మరి అక్కర తీరి కోరిన వరమైంది
పునరుజ్జీవనాడి
గుత్తికొండ బిలంనుంచి వెలువడింది విప్లవోదయం వేడి
చరిత్ర మాత్రమేనా నేనిప్పుడు ఏకరూపెడుతున్నది
నువ్వే చెప్పు, వరంగల్ ?

లోచనానికి యక్స్-రే చూపు మొలుస్తూపోంగా
కోదండరాముని ధనుస్సు అశోకబాణం సంధించంగా
విద్యుల్లతలు కల్లోలకళాసృజనలో గుమికూడంగా
ముందుండి వీథుల్ని నడిపించింది తనవెంట మహాప్రస్థాన శక్తి

**మావోడు**

బారెడే పొద్దెక్కినా బాలభాస్కరుడి తపానా సహించలేక
వెర్రికి మారుపేరేగాని వెంగలాయత్వం పెట్టింది పెడకేక
ఛెళ్ళుమంది కృష్ణుడి చెంపమీద హింసించె లోహహస్తం
జైళ్లకు జెలగమిచ్చిందే కావరం కానుకగా పరనిర్బంధదేహం
లాఠీలంగలు అడ్డగల అష్టదారుల్లో పిసను పిసను చేస్తూనేంగా
'లా వొక్కింతయు' లేని జనాలకు చేపాపుగదూ గుండెనిబ్బరం
వరంగల్' చరిత్రేకాపోలు నేనిప్పుడు రాస్తున్న కవిత్వం'
నలిగే దళాల స్వేచ్ఛాగ్ని పుష్పాన్ని మసిగానీకుండా నిలిపేవు
పాలితుడుగా మాత్రమేగాక పీడితుల్ల పోరుడిగా చరించావు
ఎన్నెన్ని పురాతేస్తే నీ గుండె కింద విచిత్రం వస్తుందని:

మెదకపనం వదిలిద్దామనా జనార్థుపటు సాహసించింది
ఉగ్ర మురళీగానంతోటి క్రూరమృగాల గుహలోగిలి
చీకటి కప్పుకున్న ఆనంద సుధాకరులతోటి
చెట్లకొమ్మలే చాచికట్టిన చేతులుగా
పిట్టలు నాలుగు నేలబడేట్లు తుపాకుల ప్రేలుడు
పెదాలమీది నవ్వు నల్లబారుతూంటే
పల్లెపట్ల తేనెతెట్టెలు రొదపెడుతూంటే
కెరటం కెరటంగా పోరాటం క్రీడాభిరామం
సాహిత్యం సవ్యసాచికావడం ఏం వింత, వరంగల్!
దేహంలో తూటాకలుగు
దేశంమీద గుద్దెలుగు
తూట్లుపడే ఛాతీలమీదినుంచి
చిట్లే అస్థికలమీదినుంచి
నాడాలేసిన కాలిబూట్ల దిమ్మెస తొడదొక్కిడినదక
లారీముంజేతివీపుల పంజావేట్ల పెనుతరగ
రైఫిల్ దురట్టహాసాల కిరాతక దుశ్చర్యాల పడగ

..సూచీతం

యమార్జన్నీ లోకానుభవాల రౌరవ నరక యాతన
లెన్నయినా ఏమైనా, వరంగల్ ' నెత్తురోడుస్తూనే
పడుతూ లేస్తూ పచ్చి పుండ్లయిన కాళ్ళతో ముందుకే
నడిచావు
అం దు కే
చరిత్రతో రాజకీయమో రెండూనో రాస్తున్నా నిప్పుడు.

పేరుకే చిన్నాలు గానీ నాకూ పెద్దన్నే, ఏదీ
ధీరత నిరూపించి దీక్ష నిర్వహించిన ఆ సంకల్పదీపం ?
నిలుపు నిలువెల్లా విహ్వలత పాకుతూ జ్వాల నాకుతూగూడా
సిరిగే పిడికిటితో ఉరి వాగ్మూలం మంట రచించిన
జ్ఞానేశ్వర్ కీర్తి ఏమయింది ?
మనిషివేటకు పరుగు స్తంభించిన సారంగపాణి వీరంగం
ఎలా ముగిసింది ?
ఎక్కడున్నాడు తల్లీ, కక్కుగోసిన కొడవంటి సుదర్శన్ ఇప్పుడు ?
ఏదీ శేషయ్య అడుగుజాడ ? ఎందరెందరిదో సడిజేసే గోర్ చప్పుడు !
చెరగని చిరునవ్వే లాంఛనంగా స్వేచ్ఛా శిశువుకు ' కుమారతంత్రం '
మంచితనం నేరానికి రామనాథం ప్రాణానికి క్రూరవ్యాధుల విషదస్త్రం
" ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహములు ? " ఏమైనై ?
అనుక్షణం ప్రాణగండాలతో ప్రచరిస్తున్నావా, అమ్మా వరంగల్ !
నిత్య భయాలతో ముడుచుకుపోయి నీరుగారవని తెలుసు
గోవర్ధనగిరి నెత్తగల బాలగోపాలుడి చిత్త స్థయిర్యం పరీక్షిస్తున్నావు
సృజనాయుధవరపాణి విప్లవవాణిని అన్వేషించుకుంటున్నావు
స్వచ్ఛంద నిర్బంధవరణంతో దుర్మరణ ప్రమాదం తప్పించుకున్న
విప్లవవిజ్ఞ

శైథిల్యాల నుంచి చివుళ్లనెత్తించే అమ్మవు నువ్వు
జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకుంటావంటే నేన్నమ్మను
నీ వేదనాగ్నిజ్వాలల్లో కాలికాలీ ఇనుం ఉక్కవుతూంది
నీ కొండకొమ్ము అలసాగబోతుంది ఆదర్శ ఆణిమ
ఈ తరానికి నువ్వు సరికొత్త నర్గొండవి
ఔను, వరంగల్ ! చరిత్రకాదు, ప్రజారాజకీయమే రాస్తున్నాన్నేను.

(కామ్రేడ్ గోపీ అరుణ స్మృతి ఎప్పుడూ తరుణంగానే ఉంటుంది.)

15-11-1985.

# ఆరంజ్యోతి

"గోదావరీ దేవి గుండె గల గల లాడి. .."
"నిండార బారు నీ యఖండ గోదావరిన్ ..."
"తెప్పున్న ఎగసిందీ గోదావరీ ..."

విశ్వనాథుడూ బాపిబావా రాయప్రోలూ పరవశించారు
'గౌతమీ కోకిల' గానం, చెలం విలాసం చవిజూపించారు
వీరావేశ విద్యార్థులు 'జగద్గురు' శంకరుడిచేత జలక్రీడ లాడించారు
హరిసర్వోత్తముడు బారులుదీర్చి యౌవన జాతీయతని నడిపించాడు
శ్రీరామరాజు సీతారాముడుగాకముందు ఒడ్డున తప్పటడుగు వేశాడు
గరిమెళ్ళ సీతానగరంనుంచి సత్యాగ్రహం ఆలపించాడు
శ్రీపాద రాజరాజుగాథ లోతుల వ్యథ ఆవిష్కరించాడు
భమిడిపాటి చమత్కారాకిట్టించి చర్వణం చేశాడు
గరికపాటి రంగస్థలంనుంచి రాజారావేవిలాసాలు తప్పించాడు
ఇలా,

అలమీది అలగా, నిండుగా, తొణుకుబాటు లేకుండా
పులకించావు గాని బదులు బలకలేదు నువ్వు.

తొంపలా రంప సీమదొరల మెడలు వంచి దడిపించినప్పుడు
కొండరెడ్లకు శ్రీశైలంనుంచి ఫడ్కే విజ్ఞాపన లందీ అర్థంగానప్పుడు
ముటాదార్ల రాంరాం మోతలు మదరాసుకోట నిద్దర వులికిపాట్లవు తున్నప్పుడు
ద్వారబంధాలు దాటి చంద్రకాంతి సూర్యతీవ్రతతో విజృంభిస్తున్నప్పుడు
'పితూరీ' గండం గడవకముందే 'పితూరీ' గా మన్యం అభిమన్య
మవుతున్నప్పుడు,

పోలీసు స్టేషన్ల భయభక్తులతో రుసాకులకు కాళ్లొచ్చి సాధుసన్యాసి
పాదాలవద్ద పడినప్పుడు
ధారకొండనుంచి అన్నవరందాకా సీతారాముణ్ణి తలచుకొని ఉప్పొంగినప్పుడు
పరంపరగా ద్రవాగ్ని తరంగాలు విస్ఫులింగాల నురుసులెత్తి మీవబడినప్పుడు
వీరేశం కన్నూ చెవీ వుండీ లేకుండా రాజభక్తి బధిరాంధుడైనప్పుడు
గురజాడ కూడా గజపతి విజయానందాల్లోపడి లఘువైపోయినప్పుడు
కాలం గర్భకోశంలో పిండప్రాణి వజ్రపాణిగా పరిణమించటోతున్నప్పుడు
స్థలం రణరంగాన రంపచోడవరం నుంచి చికాకొల్లుకు మారక తప్పనప్పుడు
అప్పుడు, నెమరేతకేనా వీరగాధకేనా అమ్మమ్మ కతకేనా పనికొచ్చేది ?
అది జీవనదిగా ఎప్పటికప్పుడు ఎర్రనీటి వరదలు తెప్పించుకునే దిగుమతి !

నా నవయౌవనం ఎన్నిమార్లు నడిపించిందో నీమీదుగా!
కొత్రపాటి మన్ను ఎర్రనెక్కుతూన్నప్పుడు
కోనసీమ గూడా కటిలబారుతున్నప్పుడు
ముంగండ రథచక్రాలమీద పూరేగుతున్నప్పుడు
విశ్వసాహిత్యం మాల జాన్ మేరీలను ఆవిష్కరిస్తున్నప్పుడు
మహీధరాలకు కాళ్ళువచ్చి నోళ్ళువిచ్చి చేతులాడినప్పుడు
మృత్యుంజయం వీరశతకం విషాదాంతంగా వినిపిస్తున్నప్పుడు
నీ సజల నయన తారకల్ని నే నాకాశ తారకలన్నప్పుడు
అనిసెట్టి గుండెలోతు కారుణ్యాన్నా నేను అలవర్చుకొంది?
అభ్యుదయ సోమసుందర లాలిత్యాన్నా నీ 'జలప్రళయం'లో కనుగొంది ?
దేవి వనిపించుకున్న నిన్ను దెయ్యమనలేదూ!
నీ పాచి నోటి గుహాలోంచి శవం కంపు లాగ లేదూ?
మఠి ఇప్పుడో!

అటొకరూ ఇటొకరూ ఒకేచోట
ఈర్ష్యా ద్వేషమై కత కసై కుస్తీ ఆట !

మారీచు

నిష్పాక్షికంగా వుండటానికి పక్షినా నేను ?
ద్రోహాన్ని, నేరాన్ని తర్జనితో గర్జించి ఖండిస్తున్నాను
ఇద్దరీ అద్దరీ చెలరేగే కార్చిచ్చుల నడుమ
చిక్కుబడి దిక్కుదోచని లేడినా నేను ?
ఇద్దర్నీ-గుర్రాన్నీ గాడిదనీ-ఒకేగాట కట్టేస్తున్నానా ?
పిచ్చిదానా, కేవలం వుద్రేకినా నేను ? ఉన్మత్తున్నా ?
నా వుద్వేగం అడుగున అభంగ పాతాళ గంగ
నెత్తుర్లోడే గుండె అరలో ఒరదీస్తూన్న ఖడ్గ శంప
నీ తోడు ! నీలో కలిసి ప్రవహిస్తూంది భావం వేడి
మోదుగుచెట్టు లోగుట్టున్నేను, ఇప్పకల్లు గుటకను,
అడివి కట్టెమోపు తాటి గొడ్డలిని, గూడెం గుబగుబని.
పొదరొదని. కోదుజనం సందడిని. గెరిల్లాదళం కదాన్ని.
నీ తోడు ! నీ తోటే నా మనస్సు
సంధిస్తూన్న సౌభ్రాత్ర ధనుస్సు !
కాకుంటే, ఎంతోదూరాన పడుతున్న నీడ పొడని !

ఒక్కతోక బట్టుకు ఊదు తాననంటున్నాడు వేటగాడు
తిక్క తలకెక్కిన తారకాసుర రాముడు నటపీరోగాడు
అంచుజూస్తా నంటున్నాడు అపార ప్రవాహానికి
అకటా వికటాట్టహాసుడు విషవాగుడు నాగుడు బెదురుగొడ్డు
దిక్కు దిక్కు గుండెల నరచేతుల బెట్టుకున్న వంద పంద మంద
నీ తల చిక్కుదీసి ఊపుల్ని ఏరి పారెయ్యగలమంటున్నై
నన్నీ ఉప్పెనలన్నీ నలుదిక్కుల్నించీ ఖాకిమూక కూచిముక్కలై
శోధిస్తాయట నీ అంతర్యాల్ని టార్చి సెర్చి ఛీ లైట్లు వేకు
బే-బేతాలియన్లు చుట్టు ముట్టేస్తాయట లోన చేవచెట్లు
సెభాస్! అభాసు కావడానికి ఆత్రెడీ బల్బు తయార్!
మరి, హ్యాజో? అది ప్రజల్ని చేరుకుంది, ఖబడ్దార్!

చూద్దాం చూద్దాం! ఈ టాటోటుగాళ్ళ సాటోప-టాటాలు
గద్దె-మద రాంఢోళ్ల దద్దద్దమ్మ శ్శరభ నాదాలు
జీపునడక చెవలపిల్లుల గుసరుస తుస్సుబుస్సులు
ఎఱ్రదిరుసు తెల్లదినుసు వేగుల కనుసైగ పగ ఖుస్సుబుస్సులు
హెలికాప్టర్ రాచసన్నాహ గగన విన్యాస రాబందూకు వుత్పాతాలు
అంపశయ్యా భీష్ముల హృదయమూకంప శాపనార్థాల ఆటసత్తాలు
అధర్ముల నీతిబాహ్య కౌటిల్య వ్యూహ ఉదార గర్భశైత్యాలు
రగులుతూ వెలగని కురవి మోసాల ఏర వేష వైపరీత్యాలు
గాడిదకాళ్ళు పట్టుకునే వాసుదేవమొగాల మూరుకాలు
చూద్దాం! చురకేద్దాం! చూపిద్దాం శూర్పణఖలకు తడాఖా!

ఎన్నైనా నిన్నేం జేయగలవమ్మా, అఖండ గోదావరీ!
ఎక్కడో దూరానున్న వుప్పునీళ్ళు బోడిగుళ్ల మీద దిమ్మరించుకోనీ!
ఏడుగా చీలి యేడవడంలేదు, సరికదా, ఏడున్నొకటి అంటున్నావు.
పోడు గొట్టుకుంటూ పోరు హోరుజేస్తూ నేలని నమ్ముకున్నావు.
నీరుగారుతావా, మరి నీరైపోతావా? గాలిసాము చేస్తావా?
నింగిచేరినా సరే, కాంతిసంవత్సరాల యెడమైనా సరే,
నిష్ఠురమైన గట్టి నవ్వు-మెలికల నిత్యకల్యాణి తీగెవి
ఆరంజోతివి!
అదొక్కటే విశాల జనకుటుంబం ధీమా,
ఆత్మవిశ్వాసమే అంతిమ విజయం ధీమా!

20-12-85

# "మార్క్సిజమే మా పథం :
# మావో వ్యాఖ్యానం"

ఇది పరిచయంకాదు, ముందుమాటా కాదు, వెనకమాటా కాదు. మాలాంటి వాళ్ళను ప్రోత్సహించి లోకానికి పరిచయం చేసిన కె.వి.ఆర్.ని మేము పరిచయం చెయ్యాలనుకోవడం అర్థరహితం. ఇది కె. వి. ఆర్. కవిత్వాన్ని పరిచయం చెయ్యడం అసలేకాదు. "సూరీడు మావోడు" కె. వి. ఆర్. ఆరో కవితా సంపుటం. ఈ కవితలుకూడా అధికభాగం పత్రికల్లో వచ్చినవే. ముప్పయి సంవత్సరాల నుంచీ రాస్తున్న కె.వి.ఆర్. కవిత్వాన్ని ఎవరూ కొత్తగా పరిచయం చెయ్యవలసిన అవసరం లేదు. కె. వి. ఆర్. మాకు ఉపాధ్యాయుడూ, మార్గదర్శీ, సహచరుడూ. తెలుగులో (ఇతర భాషల సంగతి నాకు తెలీదు) సాహిత్యాన్ని, అందులో భాగమైన కవిత్వాన్ని చదివే పద్ధతులూ, విమర్శించే సూత్రాలూ పొందవలసినంత అభివృద్ధి పొందినట్టు కనపడదు. కె. వి ఆర్. కవిత్వంమీద ఇంతవరకూ శాస్త్రీయమైన పరిశీలన జరగలేదు. అభ్యుదయ దృక్పథం వుంది. విప్లవ దృక్పథం ఉంది. అన్వయకాఠిన్యం, శబ్ద క్లిష్టతా వున్నాయి. కె. వి. ఆర్. కవిత్వ వివేచనపట్ల విమర్శకులు యీ పరిమితుల్ని దాటినట్టులేదు. ఇది పరిశీలనా దారిద్ర్యం పెద్ద పరిశోధన లేకుండా ముందే ఏర్పరచుకొన్న అభిప్రాయాల్ని పక్కనపెట్టి కె. వి. ఆర్. కవిత్వంలో, ముఖ్యంగా "సూరీడు మావోడు" కవితల్లోని కవితా సిద్ధాంతాన్నీ, కవిత్వ స్వభావ విప్లవాన్ని విశ్లేషించడం అవసరం. ఆ పని జరిగినప్పుడే ఆధునిక కవిత్వంలో, అభ్యుదయ కవిత్వంలో, విప్లవ కవిత్వంలో కె.వి.ఆర్. విలక్షణ, విశిష్ట కవిత్వ వ్యక్తిత్వం అర్థం అవుతుంది.

సాహిత్యం భావవాద ప్రత్యమం, వర్గసమాజ తలకిందు చైతన్య ఫలితం, సాహిత్యం, రాజకీయశాస్త్రం, న్యాయశాస్త్రం, నైతికశాస్త్రం ఇంటూ

ప్రత్యేకీకరణలు, ఫ్యూడల్ వ్యవస్థలో ప్రారంభమై బూర్జువా వ్యవస్థలో శాఖోపశాఖలుగా విస్తరించాయి. ఇవన్నీ వాటి వాటి సామాజిక అస్తిత్వం నుంచి వేరుచేయబడి, విభిన్న చైతన్యరూపాలుగా పరిగణనలోకి వచ్చాయి. సాహిత్యం ఒక చైతన్యరూపం అని, దాని సామాజిక భౌతిక ప్రాతిపదికని మాయంచేసి, పాలకవర్గ భాష్యకారులు స్వతంత్ర ప్రతిపత్తివాద సుడి గుండంలో పడ్డాయి. ఈ విధంగా సాహిత్యం రాజకీయ శాస్త్రాలవంటి ప్రత్యేకీకరణలమధ్య సంబంధాల్ని మార్మికం చేశారు. మేధావులు పాలక వర్గాల భావజాలకర్తలుగా మారిపోయారు. వాళ్ళు పాలకవర్గ అధికారం సహజమనీ, శాశ్వతమనీ సిద్ధాంతాలు చేశారు. ఈ అపసిద్ధాంతాలే వర్గ సమాజం అంతటా ప్రచారంలో ఉన్నాయి. ఈ ప్రత్యేకీకరణల్నీ, స్వతంత్ర ప్రతిపత్తినీ, భావజాల స్వభావాన్నీ మార్క్సిజం సామాజిక చలనసూత్రాల ఆవిష్కరణద్వారా నిరాకరించింది. వర్గసమాజ గగనసౌధాల్ని గతితార్కిక పద్ధతిద్వారా కూలదోసింది. సామాజిక ఆచరణ నుంచి విడదీయబడి, ఎకడమిక్ పంజరంలో చిక్కుకున్న బూర్జువా ప్రత్యేకీ కరణలని మార్క్సిజం తన ప్రత్యామ్నాయ ప్రత్యేకీకరణలద్వారా ప్రతి ఘటించదు. సైద్ధాంతిక స్థాయిలో మార్క్సిజం ఆర్థిక, రాజకీయ, సాహి త్యాల మధ్య వాస్తవ అన్యోన్య సారాంశ సంబంధాల్ని విశ్లేషించి ఆచరణ స్థాయిలో వాటి మార్మిక స్వభావాన్ని అభావం చేస్తుంది అందుకే మార్క్సిజం సర్వాంగ ప్రాపంచిక దృక్పథం, ఆచరణశాస్త్రం. విప్లవ రాజకీయ ఆచరణ, విప్లవ సామాజికశాస్త్రి సిద్ధాంతాల అయిక్యత మార్క్సిజం. కె. వి. ఆర్. మార్క్సిజానికి నిబద్ధమైన కవి. 'అడవి' కవితా సంకలనం నుంచీ 'సూరీడు మావోడు' దాకా, కె. వి. ఆర్. ఒక క్రమ పరిణామంలో భావజాల స్వభావాన్ని వదిలించుకుంటూ మార్క్సిస్టు రాజ కీయ కార్యాచరణలో తన కవిత్వాన్ని అవిభాజ్య అంశంగా చెయ్యగలిగారు. మార్క్సిజం నుంచి లెనినిజానికీ మావో ఆలోచనా విధానానికీ కె. వి. ఆర్. నిబద్ధతా పరిపక్వతని సాధించారు.

3

... ... ప్రత్యక్షంగా సాహిత్యానికి భావవాదాల 'తప్పుడు చైతన్య' (False consciousness) స్వభావం వుంటుంది. మోక్ష సాధనంగా వుండడం, చైతన్య ప్రాధమికతని ధ్వనింప చేయడం, హృదయాల్ని ద్రవీకరింప చెయ్యడం, మత్తు కలిగించడం, హద్దులులేని కల్పనలు చెయ్యడం, పాలకుల్ని విశిష్టీకరించడం, శబ్ద లీలావినోదం చెయ్యడం, వర్గ సమాజ సాహిత్య స్వభావం సాహిత్యాన్ని మార్మికంచేసే, అశక్తం చేసే అలంకార శాస్త్రాల నుంచీ, బూర్జువా సౌందర్య వాదాలనుంచీ, అచారిత్రిక దృక్పథం నుంచీ గతితార్కిక భౌతికవాదం విముక్తి చేస్తుంది. భౌతిక దృక్పథం నుంచీ చరిత్రని చూడటం అంటే, పునాదినీ, పుపరితలాల్నీ భౌతికంగా చూడటంకాదు; అన్నిటినీ ఒక భౌతిక మొత్తంగా చూడగల గడం. ప్రతిదాన్నీ వేరుచేసి విడిగాచూస్తే భౌతికతని స్థాపించలేం. స్థాపించినా భావవాద తప్పిదం చెయ్యకుండా వుండలేం. వుత్పత్తి శక్తుల నుంచి వుత్పత్తి సంబంధాలకీ; వుత్పత్తి సంబంధాల నుంచి రాజకీయ, సాంస్కృతిక సంబంధాలకీ భౌతికత వస్తుంది. సాహిత్యాన్ని భౌతిక ప్రత్యమంగా చెయ్యాలంటే సాహిత్యంలో ఇతివృత్తాన్ని మాత్రమేగాక, సాహిత్య స్వభావాన్ని విప్లవీకరించాలి. సాహిత్యాన్ని విప్లవ సిద్ధాంతంలో విప్లవ కార్యాచరణలో అయిక్యం చేయాలి. కవికి విప్లవ నిమగ్నత ఉండాలి. విప్లవ ఆచరణ, విప్లవ సిద్ధాంత అయిక్యతకి నిబద్ధం కావాలి. విప్లవం రాజకీయరూపంలోనే వుంటుంది. విప్లవం రాజకీయ ఆచరణ, పరస్పర విరుద్ధమైన విభిన్న సామాజిక వర్గాలు. సామాజిక కార్యాచరణ రంగంలో రాజ్యాధికారంకోసం పోరాటంలో నిమగ్నమయి వుండడం రాజకీయం. ఒక వర్గాన్ని మరొక వర్గం అణిచివేసే సంస్థీకృత అధికారం రాజకీయాధికారం. ఆస్తి సంపదం మీద అధికారం వహించే వర్గమే, రాజకీయాలమీద అధికారం వహిస్తుంది. కొద్దిమంది దోపిడి వర్గాల్ని రాజకీయాధికారం నుంచీ, సామాజిక అధికారం నుంచీ తొలగించడంకోసం,

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో శ్రామికవర్గం విప్లవం చేస్తుంది. ఈ విప్లవంలో కవీ, కవిత్వమూ భాగమయినప్పుడే, నిమగ్నమయి నప్పుడే, కవిత్వ వస్తువులో, కవిత్వ స్వభావంలో గుణాత్మకమైన మార్పు వస్తుంది. కె. వి. ఆర్. కవిత్వం శ్రామికవర్గ విప్లవ రాజకీయ ఆచరణకే, విప్లవ సిద్ధాంతానికే నిబద్ధమైంది.

"హృదయబలం లోపిస్తే
ఆయుధ బలముంటేనేం?
ఆయుధానిదేమున్నది?
నిబద్ధత ఒక్కటే పెన్నిధి"

కె. వి. ఆర్. కవిత్వం రాజకీయ కవిత్వం. రాజకీయాలకీ, సాహిత్యానికీ ఉండే సంబంధం విషయంలో, బూర్జువా సాహిత్య విమర్శకులకి ఈనాటికీ అవగాహనలేదు. సాహిత్యం, రాజకీయాలూ, స్వభావంలో ప్రయోజనంలో పూర్తిగా భిన్నమైనవి. వాళ్ళ దృష్టిలో రాజకీయాలు తాత్కాలికమైనవి. సాహిత్యం అఖండమైనది, విశ్వజనీనమైంది. సాహిత్యం రాజకీయాలూ పరస్పరం శత్రు స్వభావం కలవి. పాఠకుల్లో రాజకీయాల్ని ప్రవేశపెట్టే సాహిత్యం, రాజకీయాలకి ప్రయోజనం చేకూర్చగలదేమోకానీ, సాహిత్యానికి ఏమీ ప్రయోజనం కలిగించదు. ఇలాంటి అభిప్రాయాల్ని ప్రచారం చేసేవాళ్ళకికూడా రాజకీయాలు వుంటాయి. తమ సాహిత్యంలోని ప్రజా వ్యతిరేక అభిప్రాయాల్ని కప్పిపుచ్చుకోవడానికి ఇలాంటి వాదనలు చేస్తారు. ప్రపంచ సాహిత్య చరిత్రలో గొప్ప రచనలు అన్నీ అప్పటి పురోగామి రాజకీయాలు గలవే. కాబట్టి ఇవ్వాళ రచయితల ముందున్న ప్రశ్న. సాహిత్యానికీ రాజకీయాలకీ సంబంధం ఉండాలా? వద్దా? అనేది కాదు. సాహిత్యంలో ఏ రాజకీయాలు ఉండాలి అనేది, ఇవ్వాళ రచయితలు తేల్చుకోవలసిన అంశం. ఈ సమస్యని కె. వి. ఆర్. ముప్ఫయి సంవత్స

రాల క్రితమే నిస్పందేహంగా పరిష్కరించు కున్నారు. కోట్లాదిమంది ప్రజలు రాజకీయాల్లో నిర్మాణాత్మకంగా పాల్గొంటున్న యుగంలో మనం జీవిస్తున్నాం. వ్యక్తిగత జీవితంలోకి కూడా రాజకీయాలు చొచ్చుకొని పోతున్నాయి. మనిషి రాజకీయ జీవి అవుతున్నాడు. ఈ దశలో 'సాహిత్యంలో రాజకీయం వద్దు' అంటే, 'సాహిత్యంలో యుగజీవిత సంఘర్షణ వద్దు' అని అర్థం. ఈ సంఘర్షణతో నిమిత్తంలేని సాహిత్యం క్షీణ సాహిత్యం అవుతుంది. రాజకీయాలనుంచి సాహిత్యాన్ని విడదీయలేం రాజకీయాల ప్రభావంతో సాహిత్యం ఎంలో అభివృద్ధి పొందుతోంది. ప్రధాన రాజకీయ సమస్యలనుంచి మనిషి నిత్యజీవితాన్ని విడదీయలేని పరిస్థితి ఈనాడు వుంది. ఇప్పుడు రెండు రకాల సాహిత్యం మాత్రమే వుంది. బూర్జువా రాజకీయ సాహిత్యం, ప్రజా సాహిత్యం లేదా విప్లవ సాహిత్యం. విప్లవకర ప్రజా పోరాటాల్ని, శ్రామికవర్గ జీవితాన్ని విప్లవ సిద్ధాంతం వెలుగులో సృష్టించేది విప్లవ సాహిత్యం. అంటే విప్లవ రాజకీయాలు ప్రధాన వస్తువుగా వుంటే కవిత్వం విప్లవ కవిత్వం. విప్లవ కవులే రాజకీయ కవులు. కె. వి. ఆర్. "సూరీడు మావోడు"లో కవితలన్నీ విప్లవ రాజకీయ వస్తువుగల విప్లవ కవితలే. అలా పైకి కనిపించక పోవచ్చునేమో కొన్ని

రాజకీయ సాహిత్యానికి (Literature of Politics) సాహిత్య రాజకీయాల (Politics of Literature) కీ తేడావుంది, విప్లవ కవులు వస్తువులో విప్లవం తెచ్చారు. అభ్యుదయ కవిత్వంలో శ్రీ శ్రీ గారు, విప్లవ కవిత్వంలో శివసాగర్, చెరబండరాజు, గద్దర్‌లు కానీ, విప్లవ రాజకీయాల్ని శక్తివంతంగా చెప్పారు, కానీ వీళ్ళు కవిత్వ స్వభావంలో తెచ్చిన మార్పు చాలా తక్కువ. కవిత్వ వస్తువులో విప్లవం కవిత్వ స్వభావంలో ప్రాచీనత వీళ్ళ కవిత్వ లక్షణం. ఇది పాత సీసాల్లో

కొత్త సారా పోసే పద్ధతి, ద్రవీభవింప చెయ్యడం. శబ్ద లీలావినోదం కలిగించడం; గానాంశం వుండడం, భావ ప్రచారం వంటివే శ్రీశ్రీ, శివసాగర్, చెరబండరాజుల. విప్లవ కవిత్వ స్వభావం. వీళ్ళ కవిత్వంలో కవిత్వ వస్తువు కొత్తది. కవిత్వ స్వభావం పాతది. ఈ వైరుధ్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. అందుకనే ఇది రాజకీయ కవిత్వం. అంటే, దీన్ని తక్కువగా అంచనా వెయ్యడం కాదు. విప్లవ రాజకీయ ప్రచారంలో ఈ కవులు ఘనమైన విజయాలు సాధించారు. పాఠకులకి అలవాటులో వున్న ధోరణి కాబట్టి, ఈ కవిత్వం విప్లవ ప్రేరణ ఇవ్వడంలో, విప్లవానికి ప్రజాభిప్రాయాన్ని సుముఖం చెయ్యడంలో, అసాధారణ విజయాన్ని సాధించింది. ఇంతకీ కవిత్వంలో వస్తు విప్లవం రాకుండా స్వభావ విప్లవం రాదు. సాహిత్య వస్తువులో విప్లవం తెస్తే చాలు. సాహిత్య స్వభావంతో విప్లవం దానంతటదే వస్తుందనడం నిజంకాదు. దీనికి సాహిత్య చరిత్ర అంతా సాక్ష్యమే. వస్తువే స్వభావాన్ని నిర్ణయిస్తుందనే సూత్రం వాస్తవమే. కాని ఆ నిర్ణయ క్రమాన్ని సాధించేది ఆ చైతన్యంగల కవి.

కె. వి. ఆర్. రాజకీయ కవికూడా. ఆయన కవిత్వంలో వస్తువూ విప్లవ రాజకీయమే. కానీ కె. వి. ఆర్. ఈ పరిధిలో ఆగిపోలేదు. దాన్ని అధిగమించారు. రాజకీయ సాహిత్యాన్ని అధిగమించి సాహిత్య రాజకీయాల్ని (Politics of Literature) చేరుకున్నారు. కవిత్వ వస్తువులో మాత్రమేకాక కవిత్వ స్వభావంలో విప్లవాన్ని సాధించారు. కవిత్వానికి సంబంధించిన రాజకీయ చలనసూత్రాల్ని మార్క్సిజం లెనినిజం-మావో ఆలోచనా విధానం, విప్లవ రాజకీయ కార్యాచరణల వెలుగులో ఆవిష్కరించారు. ఇది మౌలికంగా అభ్యుదయ, విప్లవ కవిత్వంలో కె. వి. ఆర్. కవిత్వ ప్రత్యేకత. "సాహిత్య రాజకీయం" అంటే ఏమిటి? సాహిత్యంలో విప్లవ రాజకీయ వస్తువుకి అనుగుణ్యంగా సాహిత్య స్వభావాన్ని

మార్చడం. సామాజిక ఆర్థిక నేపథ్యంనుంచి రాజకీయాల్ని విమర్శించి విప్లవ రాజకీయాలు చెప్పడం. సాహిత్యానికి శ్రామికవర్గ రాజకీయ ఆచరణ ఇతివృత్తంగా ఉండడం. అనుభూతినిగాక, చైతన్యాన్ని కలిగించడం, చైతన్యాన్ని దాని అస్తిత్వగతి తర్కంతో కలిగించటం. సాహిత్యంలో విద్యావంతంచేసే (Edicate) గుణంమీద కేంద్రీకరించి, పాఠకుడికి లేదా శ్రోతకి ఆలోచననీ వివేకాత్మక వికాసాన్ని కలిగించడం, సాహిత్య రాజకీయం. ఈ వికాసత పాఠకుల్ని రాజకీయంగా నిబద్ధుల్ని చేస్తుంది. సాహిత్యంలో రాజకీయాలకీ; సాహిత్య రాజకీయాలకీ ఇది నిబద్ధం అవుతుంది. సాహిత్యం రాజకీయపాత్ర నిర్వహించడం, వర్గ పోరాటంలో శ్రామికవర్గ ఆయుధంగా వుండడం, సాహిత్య రాజకీయంలో కీలకమైన అంశాలు. పీడిత వర్గాల్ని ఉద్ధరించే ఉపదేశ రూపంలోగాక సాహిత్యాన్ని వాళ్ళ పోరాటంలో చలనశీల భాగంగా చేస్తుంది. సాహిత్య, రాజకీయ ఆచరణలు అయిక్యంగా వుంటాయి. సాహిత్య రాజకీయం సాహిత్యానికి పదార్థ స్వభావం కలగజేస్తుంది. సాహిత్య రాజకీయంవల్ల, సాహిత్య భౌతికరూపాన్ని పొంది, పోరాటంలో, విప్లవకర జీవితంతో, పరస్పర చర్యలో, ప్రవేశిస్తుంది. అప్పుడు సాహిత్యం మౌలికపోరాటంలో మౌలిక సాధనం అవుతుంది. "రాజకీయం" అనగానే వారిత్రికత భాగంగా వుంటుంది. సాహిత్యం రాజకీయం పరస్పర చలనంలో ఉండటం, సాహిత్య రాజకీయ లక్షణం. ఇది సాహిత్యాన్ని భౌతికవాదపు ప్రక్రియంగా మారుస్తుంది. ' So long as it sticks in its bourgeois skin'' సాహిత్యం బూర్జువా చర్మాన్ని అంటిపెట్టుకొని వున్నంతకాలం, సాహిత్య స్వభావాన్ని భౌతిక తత్వంగా మార్చలేం. సాహిత్య రాజకీయమే సాహిత్యాన్ని బూర్జువావర్గ చర్మంనుంచి విముక్తి చేయగలదు. ఇలా విముక్తి చేయబడిన సాహిత్య రాజకీయశాస్త్రమే శ్రామికవర్గ ఉద్యమంలో చైతన్యవంతమైన భాగం కాగలదు. శుద్ధ సాహిత్యరూపాన్ని విసర్జించి విప్లవకరం కాగలదు. మాయా స్వభావం (Fetishized)

పొందిన, పరాయీకరణం (Alienated) పొందిన సాంఘిక సంబంధాల్ని విప్లవ చలనసూత్రాల్లోకి విద్యుద్దీకరించాలంటే సాహిత్య రాజకీయశాస్త్రం అవశ్యం అవుతుంది విమర్శ, విప్లవాల సమ్మేళన పాత్రని సాహిత్యం నిర్వహించ గలుగుతుంది. సాహిత్యానికి ఆచరణ స్వభావం సాహిత్య రాజకీయాలు లేకుండా రాదు. ఆలోచన వివేకాత్మక వికాసాల్తో విద్యావంతం చేస్తూ ప్రజల్ని ఆచరణలోకి ఐక్యం అయ్యే చైతన్యాన్ని ఇవ్వడం సాహిత్య రాజకీయ లక్ష్యం. ఈ సాహిత్య రాజకీయమే కె. వి. ఆర్. కవితా సిద్ధాంతం.

ఈ సిద్ధాంతంలో ఆచరణ సిద్ధాంతాల అయిక్యత నుంచి కవిత్వంలో సౌందర్యం ప్రకాశిస్తుంది. కవిత్వంలో సౌందర్యం కవిత్వంలో నుంచి పుట్టేది కాదు. వివిధ ఉపరితల అంశాలు రాజకీయాల ఆధిపత్యంలో కవిత్వంలో కలిసిపోవడంద్వారా వస్తుంది. అనురూపత, పరిపక్వత, పొందిక, క్రమత్వం, ఉదాత్త నిర్మాణం. కవిత్వ సౌందర్యంలో గతితార్కికంగా మొత్తంగా ఉంటాయి "First the political, them artistic" అనేది సాహిత్య రాజకీయాల ప్రాథమిక సూత్రం. కవిత్వంలో రాజకీయం, సౌందర్యం. సహ అస్తిత్వంలో ఉండవు అస్తిత్వంలో ఉంటాయి. ఈ సాహిత్య రాజకీయ సిద్ధాంతానికి 'సూరీడు మావోడు' లో కవితలన్నీ లక్ష్యాలే. ఆల్కెమీ నుంచి కెమిస్ట్రీ విముక్తి పొందినట్లు కె. వి. ఆర్ కవిత్వం సాహిత్యాన్ని 'సారస్వతం నుంచీ, "రస సారస్వతం" నుంచీ అందం-ఆనందం పరమావధి" నుంచీ విముక్తం చేసింది.

కె. వి ఆర్ సాహిత్య రాజకీయ కవి.

త్రిపురనేని మధుసూదనరావు

తిరుపతి

18-12-85